# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా
ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206
web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com



Volume 28 Issue 9
No.of Pages 40
MAY 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:
మేనేజరు
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

**ఈ సంచికలో....** **పేజీ**

# భద్రవాక్యం

**వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాస యోగాద్యత యః శుద్ధ సత్త్వాః ।**
**తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాః పరిముచ్యంతి సర్వే॥**

-ముండకోపనిషత్

ఈ శ్లోకం తృతీయ ముండకం ద్వితీయ ఖండంలోని ఆరవమంత్రం.

వేదాంతములు అంటే ఉపనిషత్తులు. ఉపనిషత్తులన్నింటి చేత చక్కగా నిశ్చయింపబడిన అర్థము ఆత్మజ్ఞానము లేదా ఆత్మానుభూతి. సన్యాసం అంటే కర్మసన్యాసం కాని, కర్మఫల త్యాగం కాని ఏదైనా కావచ్చు. అటువంటి సన్యాసం వలన కలిగేది నైష్కర్మ్య సిద్ధి. ఇక్కడ యోగం అంటే పతంజలి యోగశాస్త్రం లోని అష్టాంగ యోగం కాదు. నిష్ఠ లేదా బ్రహ్మనిష్ఠ అంటే బ్రహ్మముతో యోగం చెంది ఉండటం అని అర్థం. శుద్ధ సత్త్వాః అంటే రజస్తమోగుణముల స్పర్శ అయినా లేని, వాటి వాసన అయినా తగలని కేవల సత్త్వ గుణం. త్రిగుణములోని సత్త్వగుణం కంటె ఇది పూర్తిగా భిన్నమైనది. శుద్ధ సత్త్వ మాత్రులు పూర్ణకాములై ఉంటారు. శ్రీకృష్ణభగవానుని శరీరం అటువంటి శుద్ధసత్త్వమయం అని, ఎవరు ఎటువంటి కోరికలతో భావాలతో అక్కడకు చేరినా వారికి ఆత్మరతి, కైవల్య ప్రాప్తి మాత్రమే లభిస్తుందని మనం భాగవతంలో చూస్తాము. ఎవరు సంసారంలో మునిగితేలుతూ, కర్మలను ఆచరిస్తూ ఆ కర్మఫలానుభవం కోసం జన్మకు వస్తుంటారో వారి మరణకాలం అపరాంతకాలం. కాని ఎవరు దేహం చాలించిన తరువాత తిరిగి జన్మకు రారో  వారి దేహాంతకాలం పరాంతకాలం. అది పరము, అమృతము అయినది. అట్టి పరామృతులు బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మమయులు, జీవన్ముక్తులు. జీవన్ముక్తులై ఉపాధి ప్రారబ్ధాన్ని అనుభవిస్తుంటే వారు దేహవాసన లేక బ్రహ్మముతో ఏకస్వరూపులై ఉంటారు. సూర్యుడు ఒక్కడే అయినా ఒక్కొక్కరికి ఒక్కొక్కడుగా కనిపించినట్లు బ్రహ్మలోకం ఒకటే అయినా ఒక్కొక్కరికి ఒక్కొక్క బ్రహ్మలోకంగా అనిపిస్తుంది. కనుక బ్రహ్మలోకేషు అని బహువచన ప్రయోగం చేసి ఉండవచ్చు. పరిముచ్యంతి అంటే సర్వబంధముల నుండి పూర్తిగా విడిచిపెట్టబడి విముక్తులు అవుతున్నారు అని అర్థం. ఉపనిషత్ప్రతిపాదిత జ్ఞానంలో నిష్ఠులైనవారు సన్యాస యోగంచే నైష్కర్మ్య సిద్ధిని పొంది, నిరంతర బ్రహ్మనిష్ఠులు, శుద్ధసత్త్వమాత్రదేహులు అయిన యతులు, పాము కుబుసమును విడిచిపెట్టినట్లు దేహమును విడిచిపెట్టే సమయంలో వత్తి అనే ఉపాధి నశించగానే దీపతేజము మహాతేజముతో, ఘటం విచ్ఛిన్నం కాగానే ఘటాకాశం మహాకాశంతో విడదీయటానికి వీలుకాకుండా కలిసిపోయినట్లు బ్రహ్మముతో ఏకస్వరూపులై విదేహముక్తిని పొందుతారు అని పై మంత్రం తాత్పర్యం. *

# అమ్మ ఆశీస్సులు

ఆత్మస్వరూపులారా! అన్ని జన్మలకంటే మానవ జన్మ చాలా ఉత్తమమైనది. మానవునికి తెలుసుకువే జ్ఞానమున్నది. ఎనుబది నాలుగు లక్షల జీవరాసులలో మానవజన్మ చాలా విశిష్టమైనది. మంచి చెడులను గ్రహించే విచక్షణా జ్ఞానము దానికే కలదు. మోక్షమును పొందుటకు మానవునికే అర్హత కలదు.

పరమాత్మ నిరాకారుడు, సర్వవ్యాపి. ఈ ప్రపంచమునందు సూదిమొన మోపునంత సందు కూడ లేక నిండియున్నాడు. సముద్రము నుండి కెరటము వచ్చునట్లు పరమాత్మ నుండి సర్వజీవులు పుట్టుచున్నవి మరియు లయమొందు చున్నవి.

విద్యలలోకెల్ల బ్రహ్మవిద్య చాలా గొప్పదైనది. రహస్యములలోకెల్ల అతి రహస్యమైనది, పవిత్రములలోకెల్ల అతిపవిత్రమైనది...........

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥**

(భ.గీ.9 /2)

దీనిని ఎవరైతే తెలిసికొని త్రికరణశుద్ధిగా సాధన చేస్తారో వారు బ్రహ్మజ్ఞానియై వెలుగొందుదురు. మోక్షమును పొందుదురు.

మోక్షము అనగా మోహము నశించుట. గురుమంత్రమును సాధన చేసిన మనస్సు నిశ్చలమైన పరమాత్మను దర్శింప వచ్చును.

ఏప్రిల్‌లో జరిగిన సత్సంగ సమావేశములలో ఎందరో మహానుభావులు, భక్తుల మనస్సులను రంజింపచేసి పరమాత్మను దర్శించెడి మార్గములను ప్రబోధించినారు. అట్టి గురుపరమాత్మ పాదుకలు సర్వదా కాపాడుగాక!

- మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీగురుదేవులు శ్రవణానికి ఎంతో ప్రాధాన్యతనిచ్చారు. అదే ఒరవడిలో శ్రీకాళీవనాశ్రమ పీఠాధిపతి పూజ్యయోగిని శ్రీచంద్రకాళీ ప్రసాద మాతాజీవారు ఎన్నెన్నో ప్రాంతాలు సందర్శిస్తూ, అవిశ్రాంతంగా ఎందరెందరికో తమ బోధామృతాన్ని శ్రవణం చేసే భాగ్యాన్ని కలిగిస్తున్నారు. అంతేకాదు ఏప్రిల్ నెలలో ప్రారంభం చేసి, భక్తుల కోర్కెపై ప్రతినెల మూడురోజులు త్రయాహ్నిక దీక్షా పూర్వకంగా ఆశ్రమంలో సత్సంగ కార్యక్రమాలు నిర్వహించటానికి అనుమతించారు. వీటిలో శ్రీమాతాజీవారి బోధామృతం మాత్రమే కాక భక్త సోదర సోదరీమణుల ఆధ్యాత్మిక ప్రసంగాలు కూడా ఉంటాయి. కార్యక్రమాలు తేదీలు, విశేష కార్యక్రమాల శీర్షిక క్రింద, కరపత్రాల ద్వారా అందించబడతాయి. బయట గ్రామాల నుండి, నగరాల నుండీ కార్యక్రమానికి వచ్చేవారికి ట్రస్ట్‌వారు ఎంతో ఉదారంగా ముందుకు వచ్చి ఉండటానికి, భోజనానికి వసతులు ఏర్పాటు చేస్తున్నారు. అందరినీ సాదరంగా ఆహ్వానిస్తున్నాము.

ఏప్రిల్ 29వ తేదీ వైశాఖ శుద్ధ పంచమినాడు ఆశ్రమంలో శ్రీశంకర జయంతితో ఆదిశంకరుల అవతారంగా ఎందరో భక్తులు భావించుకునే శ్రీసద్గురుమూర్తి బృందావన ప్రతిష్ఠా 14వ వార్షిక మహోత్సవాన్ని ఎంతో భక్తి భరితంగా జరుపుకున్నారు.

శ్రీసుశీల ప్రసాదగారి కలం నుండి వెలువడుతున్న శ్రీకృష్ణ కర్ణామృతాన్ని ధారావాహికంగా ప్రచురిస్తున్నాము. భక్త హృదయాలు ఆ బాలకిశోరాన్ని ఆస్వాదించి తప్పక ఆనందించగలవని భావిస్తున్నాము. దాదాపు నాలుగు దశాబ్దాల పూర్వం వార్తాపత్రికలలో ప్రచురింపబడిన శ్రీబాబూజీ దివ్యవాణిని చాలా సంవత్సరాల తరువాత ఇప్పుడు పాఠకులకు అందించటానికి ప్రయత్నం చేస్తున్నాము. శ్రీగురుదేవుల వాక్కులను మననం చేసుకోవడటానికి భక్తులకు ఇది సహాయపడుతుందని మా విశ్వాసం.

ఈ నెల 9వతేదీ వైశాఖ పూర్ణిమ, బుద్ధ పూర్ణిమ. గురుపూజ కార్యక్రమంతోపాటు సత్సంగ కార్యక్రమం కూడా ఉంటుంది. మరునాడు త్రయాహ్నిక దీక్షా పూర్వకంగా తెల్లవారు జామునుండి సత్సంగ కార్యక్రమాలు ప్రారంభం అవుతాయి. ఇంతవరకు శ్రీమాతాజీవారు తె.జా. 4గం.30ని॥ల నుండి 5గం.ల వరకు చేస్తున్న ప్రబోధం విన్న ఆధ్యాత్మిక జిజ్ఞాసువులందరికీ అది వారి సాధనలో అత్యంత ఉపయోగకరంగా ఉన్నవిషయం అనుభవంలో ఉన్నదే. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసికోమని భక్తులకు మరొకమారు విన్నవిస్తూ.........

- గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

ఆ వెనుకనే వాళ్ళ అత్తలు, మామ్మలు, బామ్మలు, పిల్లలు వచ్చేవారు. అందరి పని అలాగే అయ్యేది. అందరూ ఆ దివ్యోన్మాదంలో మునిగిపోయేవారు వీరంతా తమ ముందు చావడిలో శిల్ప ప్రతిమలలాగా నోళ్ళు తెరచి నిలబడి కృష్ణయ్య వైపే చూస్తుంటే, లోపల నుంచి యశోదమ్మ కృష్ణునికోసం అక్కడికి వచ్చి, వాళ్ళందరినీ చూసి తన చిన్నారి బిడ్డకు ఎక్కడ దిష్టి తగిలిపోతుందో అని, 'ఇదేం అన్యాయమర్రా! బయటకు వెడితే కదలనివ్వకుండా వాణ్ణి ఇంట్లో ఉంచేశాను. బయట తగిలే దిష్టిచాలక ఇలా మీరంతా మా ఇంటికి వచ్చి ఇంట్లో కూడా వాడికి



దిష్టి కొడుతున్నారా? చాలు. ఇక మీ ఇళ్ళకు వెళ్ళండి' అని వాళ్ళను కోప్పడి'రా రా నాయనా! నీకు ఎండు మిరపకాయలతోనూ, కొబ్బరికాయతోనూ దిష్టి తీసేస్తాను' అని కృష్ణుణ్ణి లోపలికి తీసుకువెళ్ళటం; వచ్చినవాళ్ళంతా 'మేమేమీ మీ నల్లవాడికి దిష్టికొట్టేందుకు రాలేదు లేవమ్మా! ఏదో మా దీపాలు వెలిగించుకు పోదామని వచ్చాము' అంటూ వెనక్కి వెనక్కి కృష్ణయ్య వంకనే చూస్తూ వెళ్ళలేక వెళ్ళలేక బయటకి వెళ్ళటం, కృష్ణయ్య కూడా వెనక్కి తిరిగి వాళ్ళవంకే చూసి నవ్వులు చిందిస్తూ, నవ్వుల రూపంలో ఆశీస్సులు అందిస్తూ వెళ్ళలేక వెళ్ళలేక లోపలికి వెళ్ళటం. ఇది రోజూ సాయంత్రం నిత్యకృత్యమై పోయింది.

ఇలా వారందరి హృదయాలలో భక్తి అనే శక్తిని ప్రవేశపెట్టాడు కృష్ణయ్య. సర్వబంధములను హరించగల భక్తిమార్గమును గోపికలకు, వ్రేపల్లెవాసులకు చూపించాడు. వాడవాడలా ఆయన మహిమ వ్యాపించింది.

వ్రేపల్లెలో **95**సంవత్సరాల వృద్ధురాలు ఒకామె ఉంది. ఆమె భర్త, కొడుకులు, కోడళ్ళు, మనుమలు, మనుమరాళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు అందరూ కృష్ణప్రేమకే అంకితమైనారు. ఆమెకు ఇదంతా నచ్చక, తాను

ఏమైనా సరే ఈ అల్లరివాని ఆకర్షణకు లొంగరాదని మొండికేసింది. అందరి ఇళ్ళలో దీపాలు వెలగాలంటే యశోదమ్మ ఇంటికే రావాలి. కొన్నాళ్ళు రాకూడదని తీర్మానించుకున్నారు. అందరి ఇళ్ళల్లోనూ చీకటే. అయితే దానిమీద అలిగి రావటం మానేసిన వాళ్ళ గతి ఏమౌతుంది? మళ్ళీ అందరూ ఆ ఇంటికి రావటం తప్పలేదు. అలా అన్ని గృహాలలోనూ మానవ హృదయాలలోనూ దివ్యజ్యోతిని వెలిగించిన జ్యోతిస్వరూపుడు కృష్ణపరమాత్మ.

ప్రతిరోజూ సాయంత్రం గోధూళివేళ కృష్ణయ్య ఉదయమే గోపకుమారులతో పాటు మేతకు తీసికెళ్ళిన గోవుల మందలను తిరిగి ఇంటికి తీసికొని వస్తూ, గోధూళి ధూసరితమైన ముద్దుమోముపై మురిపించే ముంగురులు ముద్దుగా కదలాడుతుండగా, ముత్యాల వంటి చిరుచెమట బిందువులను తన కొనగోటితో తీసివేస్తూ, అవస్థాత్రయమును హరించే దివ్యమంగళ స్వరూపముతో, మునిమనోవృత్తులను కూడా హరించగల ముగ్ధ మోహన స్వరూపముతో వేద గానాన్నే వీనులవిందుగా అందించే వేణుగానం చేస్తూ గోవుల మందలతోనూ, గోపబాలురతోనూ తిరిగి వస్తూ ఉండేవాడు.

జడమునకు కూడా చైతన్యమునిచ్చే ఆ స్వామిని కనులారా దర్శించి, తమ దశేంద్రియాలకు శాంతిని కలిగించుకోవాలని, ఆ కృష్ణభక్తిలో లీనమై, భవబంధ విముక్తిని సాధించాలని గోపికలు, యితర వ్రేపల్లెవాసులూ అందరూ  నాలుగు వీధులు కలిసేచోట, చౌరాస్తాలో (బాబు సౌరాష్ట్రం అనేవారు) వేచి ఉండేవారు. ఆ స్వామి ఆ సమయంలో అందరినీ చూస్తూ మధురప్రేమ రూపంలో అందించిన ఆత్మానందమనే సుప్రసాదాన్ని ఆరగించిన వ్రజవాసుల అదృష్టమే అదృష్టము.

ఈ అపురూప సన్నివేశాన్ని చూడాలని, గగన వీధులలో దేవతలు విమానారూఢులై వచ్చి, ఆ మనోహర దృశ్యాన్ని తిలకించి, ఆ గోపబాలుర అదృష్టాన్ని కొనియాడేవారు. 'ఆ వ్రజభూమిలో గోపకులంలో మానవులై జన్మించి ఆ భాగ్యాన్ని పొందలేకపోయామే' అని తమ దురదృష్టాన్ని నిందించుకునేవారు.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

మనసు మాయయే. కానీ జగన్మాత తత్త్వాన్ని ఆచరించడానికి, అనుభవంలోకి తెచ్చుకోవడానికీ కూడా ఆ మనస్సే సాధనమయి కూర్చుంది. భగవత్తత్త్వం మనోవాక్కులకి అగోచరమయినా వాటికాధారం మాత్రం అదే. మనం ఏ విషయంలో ఎంత జాగ్రత్తగా ఉండాలో, ఏ సమయంలో ఎలా ప్రవర్తించాలో మనకి స్ఫురింప చేసేది మనస్సు.



మనం మనస్సు గురించి ఎందుకింత మాట్లాడుకోవలసి వస్తోంది? మనసు మాయ కదా! యా=ఏది మా= లేదో సా=అది 'మాయ' అని మాయకి అర్థం చెపుతారు. అంటే మనసు అనేది లేనట్లే కదా అని మీరు అడగవచ్చు. నిజమే. దానికి ఉనికే లేదు. కాని అది మీరు గుర్తించాలి గదా! అంతవరకూ దాని గురించి మాట్లాడుకోవలసిందే. ఈ మనస్సు అనేది బయటకి కనబడదు. కనకనే దానిని 'అంతరింద్రియం' అన్నారు. అది మన లోపలే ఉండి ఈ ఇంద్రియాలన్నిటికీ మెయిన్ స్విచ్‌గా పనిచేస్తుంది. యథార్థానికి మనసు జడమే అయినా, అది సర్వశక్తిమంతురాలినని అనుకుంటుంది. ఆ విషయం గురించి తరువాత విచారిద్దాం.

మనం చేసే పనులన్నిటికీ మూలమైనది మనస్సు. మనసుతోనే మనమీ సృష్టిని చూడగలుగుతున్నాము. పరమాత్మ వస్తువుని తెలిసికోవడానికి కూడా సాధనం మనసే. మానవుడు ఎటువంటి అనుభవాన్ని పొందినా దానికి కారణం మనస్సే. మానవుడిని బంధాలలో పడవేసినా, మోక్షాన్ని సాధించి పెట్టినా కారణం మనస్సే. మనస్సుని ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయాల పైనే ఉంచితే అది మనని బంధానికి గురిచేస్తోంది.

విషయ ప్రేరితమైన మనస్సుతో ముక్తిని సాధించటం దుర్లభం. విషయాకారితమైన మనస్సు 'మలిన మనస్సు'గా పిలువబడి బంధానికి కారణం అవుతోంది.

అదే మనస్సుని గురుదేవులు ప్రసాదించిన లక్ష్యార్థంపై నిలిపి సాధన చేయగా చేయగా, అది విషయరహితమై శుద్ధ మనస్సుగా మారిపోతుంది. శుద్ధ మనస్సు మనకి జనన మరణ సంసార బంధం నుండి విముక్తిని ప్రసాదిస్తుంది. అప్పుడు ఈ జన్మమే మన కడసారి జన్మమవుతుంది. గురుదేవులు ప్రసాదించిన లక్ష్యార్థాన్ని సాధించిననాడే మన జన్మకి సార్థకత లభిస్తుంది.

మనస్సును భగవంతునిపై నిలిపినవారు ఎప్పుడూ ఆనందంగానే ఉంటారు. వారి ముఖంలో ఆనంద కాంతిరేఖలు వెల్లివిరుస్తూ ఉంటాయి. భక్త రామదాసు, కబీర్, మీరా, సక్కూబాయి, ప్రహ్లాదుడు ఇత్యాది మహాభక్తులందరూ ఎన్నెన్నో కష్టాలని, విషమ పరీక్షలని ఎదుర్కొన్నారు. కానీ వారు ఏనాడు కష్టాలని కష్టాలుగా భావించలేదు. 'నా ప్రారబ్ధ కర్మని తొలగించడానికి ఇంత కష్టపడు తున్నావా ప్రభూ! జగన్నాథా! నువ్వు నాకుండగా నన్ను ఎవరేమి చేయగలరు?' అని ధైర్యంగా నిలబడ్డారు.

అందుకే ఈనాటికీ వారి చరిత్రలు సువర్ణాక్షరాలలో ప్రకాశిస్తున్నాయి. మహాత్ములంతా కూడా మనకి మల్లే ఒక తల్లికి జన్మించినవారే. అమ్మలేని సృష్టిలేదు. కానీ వారు తమ మనస్సులను తమ ఆధీనంలో ఉంచుకున్నారు కనుకనే వారు మహాత్ములయ్యారు. మనస్సు ఆధీనంలో ఉండేవాడు మానవుడు. 'భగవంతుడు ఉన్నాడని నమ్మండి' అని మహాత్ములు ఘోషిస్తున్నారు. వారు చూపిన మార్గంలో వెళితే జన్మకి సార్థకత లభిస్తుంది. అందుకనే అస్మద్గురుదేవులు ఉదయం లేవగానే మహాభక్తులందరినీ ఒక్కసారి స్మరించుకోవాలని చెప్పేవారు.

మహాత్ములు, సద్గురువులు ఇంతగా చెవిలో ఇల్లుకట్టుకుని మనకి బోధ చేస్తున్నా ఈ మాయదారి మనస్సు విషయాదుల వైపుకే ఎందుకు వెళ్తోంది? అది దానికి స్వాభావికం, మనస్సు విషయ ప్రేరితమైనప్పుడు ప్రతి సాధకునికి తను తప్పు చేస్తున్నానని తెలుస్తుంది. అప్పుడు గురుబోధని గుర్తుకు తెచ్చుకుని మనస్సుని గురుమూర్తి యందు, లేదా తన ఇష్టదైవము యందు నిలపడానికి ప్రయత్నం చేస్తే, మనస్సు విషయ రహితమవుతుంది.

-సశేషం

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

**26-2-1985**

ఈ రోజు రాత్రి శ్రీబాబు భక్తులకు దర్శనం ఇచ్చారు. శ్రీ నారాయణ రావు దంపతులు, శ్రీబాబుకు పూలహారం వేసికొని నమస్కారం చేసికొన్నారు. భక్తులందరమూ స్వామికి నమస్కరించి సెలవు తీసుకుంటున్నాము.

శ్రీగోపాలరాజు దంపతులు సెలవు తీసికొనటానికిపోగా ఎక్కడికి వెళ్ళుతారయ్యా ఉండండి అని అన్నారు శ్రీబాబు. ఆయన మాట్లాడుతూ కోతలు బాబు అని అన్నారు. కోతలు అయితే నీవు ఏమి చేస్తావు? నీవు వెళ్ళి కోతలు కోయించు చూద్దాం ఎలా కోయిస్తావో అన్నారు శ్రీబాబు.

తరువాత శ్రీ సత్తిరాజుగారి అన్నగారి కోడళ్ళు నమస్కారాలు చేసుకుంటుండగా మీరు కూడా 'వెళ్దామా' అనుకుంటున్నారా? అని శ్రీబాబు ప్రశ్నించారు. వారు సమాధానం చెప్తూ మేము అనుకోవటం లేదు కాని మా వాళ్ళు వెళ్దాము అంటున్నారు అని సమాధానం చెప్పారు. వాళ్ళు అలాగే అంటారులే మీరు ఉండండి అన్నారు శ్రీబాబు.

ఇంతలో కుట్టి వచ్చారు. శ్రీబాబు మాట్లాడుతూ ఏమిట్రా కుట్టీ విశేషాలు? అని అడిగారు. కుట్టి మాట్లాడుతూ మా అబ్బాయికి అక్షరాభ్యాసం చేయించాలి బాబు అన్నారు. ఏమిటిరా బ్రాహ్మణుడవు అయి ఉండి అలా మాట్లాడుతున్నావు? అన్నారు శ్రీబాబు.

కుట్టి సమాధానం చెబుతూ నేను బ్రాహ్మణుడను కాదు బాబు అన్నారు. అయితే జంధ్యం తీసివేయి చూద్దాం అన్నారు శ్రీబాబు. కుట్టి వెంటనే జంధ్యాన్ని తీసివేయ బోయాడు. శ్రీబాబు ఆగు ఆగు తీయమనగానే జంధ్యాన్ని తీయగలిగావు కానీ, ఎత్తుగా ఉన్న నీ ముందు పన్ను తీయి చూద్దాం అన్నారు. కుట్టి ఆశ్చర్యంగా చూస్తూ పన్ను తీయటం నేను చేయలేను. దానికి ఒక డెంటల్ సర్జన్ కావాలి అన్నారు.

శ్రీబాబు వెంటనే కలుగజేసుకుని 'చూశావా! ఆ పన్ను లాగానే మీలో పాతుకునిపోయి ఉన్న సంకల్పాలని, గుణాలని తొలగించుకోగలరా? వాటిని తొలగించుకోవటానికి ఒక ఘనవైద్యుడు కావాలి. అతడే 'గురుమూర్తి' అన్నారు.

ఇంతలో రామమూర్తిగారు నమస్కారం చేసుకుంటూ సెలవు తీసుకుని మళ్ళీ వస్తాను బాబూ! అన్నారు. శ్రీబాబు మాట్లాడుతూ 'నీవు హైద్రాబాద్ వదిలి ఎందుకు వస్తావయ్యా? ఆశ్రమవాసులు అవ్వాలంటే ఎంతో జన్మ సంస్కారం ఉండాలి. ఎన్నో జన్మల సంస్కారం రాశీభూతం అయితేనే ఆ భాగ్యం కలుగుతుంది' అన్నారు.

ఇంతలో మూర్తీజీ హైద్రాబాద్ వెళ్ళటానికి శ్రీబాబు అనుమతి కోరారు. శ్రీబాబు అనుమతి ఇస్తూ 'రెండు పాటలు పాడాలి. అంతేగాకుండా హైద్రాబాద్ నుంచి మళ్ళీ ఇక్కడకు రావాలి. వచ్చేటప్పుడు ఆశ్రమం నుంచి హార్మోనియం, తబలా తీసుకురావాలి' అన్నారు. ఇంకా మాట్లాడుతూ 'తబలా' తీసుకురావాలి కమల కాదు' అన్నారు. మూర్తిగారు సరే అన్నారు.

శ్రీబాబు మాట్లాడుతూ తీరా ఆవిడ వస్తానంటే? అని ప్రశ్నించారు. వస్తానన్నా తీసికొని రాను అన్నారు మూర్తీజీ. చూస్తానుగా వీళ్ళందరూ నాకు సాక్ష్యం అన్నారు శ్రీబాబు. మూర్తీజీ మీరా భజనపాటలు పాడారు. నీవు పాడిన పాటలకు అర్థం చెప్పు అన్నారు శ్రీబాబు. మూర్తీజీ మాట్లాడుతూ నా శరీరంలో అణువణువునా నీవు ఉన్నావు. నీవు లేనిదే నేను లేను. నా శరీరంలో, మనస్సులో అంతా నీవే నిండి ఉన్నావు అన్నారు మూర్తీజీ.

శ్రీబాబు కల్పించుకుని 'దేహం అంటే ఏమిటి? మనస్సు అంటే ఏమిటి? మనస్సు లేకుండా దేహం ఉంటుందా? నిదుర పోయేటప్పుడు మనస్సు ఉంటుందా?' అని ప్రశ్నించారు. నేను దీన్ని గురించి ఎన్నడూ ఆలోచించలేదు అన్నారు మూర్తీజీ.

శ్రీబాబు తిరిగి ప్రశ్నిస్తూ 'నిదురపోయే టప్పుడు నీవు ఉన్నావా? నీవు అంటే ఆ నీవు ఎవరు? అదే చైతన్యం లేక ఆత్మ లేక పరమాత్మ అని తెలుసుకో లైటు స్విచ్ వేస్తే లైటు వెలుగుతుంది. స్విచ్ తీసివేస్తే ఆరిపోతుంది. అందులో కరెంట్ ఉందా లేదా అని ప్రశ్నించారు శ్రీబాబు.

ఇంతలో మూర్తీజీ మాట్లాడుతూ 'నేను విచారణ చేస్తుండగా ఒక అనుమానం వచ్చిందండి. మానవుడిలో, పిల్లిలో, కుక్కలో, పులిలో, జడమైనటువంటి రాతిలో, ఒకటేమిటి అన్నింటిలో ప్రకాశించేది ఆ ఆత్మ వస్తువే కదా! దీనిని అన్వయించటం ఎలాగ?' అని ప్రశ్నించారు.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**మే 2009**

**9 శని  వైశాఖ పూర్ణిమ**, ఉదయం 5గం.30ని॥లకు శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన.

**10, 11, 12** సత్సంగ కార్యక్రమాలు.

**14 గురు** శ్రీ కాళికా పరమేశ్వరీ సహిత రామలింగేశ్వరస్వామి ప్రతిష్ఠాఅష్ట వింశతి వార్షిక మహోత్సవము, రాత్రి 7 గం.లకు మహాకాళికా పరమేశ్వరి రామలింగేశ్వరస్వామివారల లీలా కళ్యాణ మహోత్సవము.

**19మంగ శ్రీగురుదశమి**, హనుమజ్జయంతి, హనుమాన్ చాలీసా పారాయణ, సత్సంగం, శ్రీ సద్గురుదేవుల పాదపూజ.

**23 శని** మాస శివరాత్రి.

**జూన్ 2009**

**1 సోమ** శ్రీ సుగుణప్రసాద మాతాజీవారి ద్వితీయవార్షిక పుణ్యారాధన, శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం.

**7 ఆది పూర్ణిమ,** శ్రీ సద్గురు పాదపూజ.

**17 బుధ శ్రీ గురుదశమి**, సత్సంగం, శ్రీ సద్గురు పూజ.

**19, 20, 21** సత్సంగ కార్యక్రమాలు.

**21 ఆది** మాస శివరాత్రి

సర్వేశ్వరుడు సర్వాంతర్యామి అనే సత్యాన్ని శిష్యులు గ్రహించారో లేదో అని పరీక్షపెట్టి తేల్చుకోవాలని గురువు ఒకరు నిశ్చయించుకొని అందరికీ తలా ఒక మామిడిపండు ఇచ్చి ఎవరూ లేని ప్రదేశానికి వెళ్ళి తినమని పంపాడు.

ఎవరిదారినవారు వెళ్ళి తమ పండు తిని తిరిగి వచ్చారు ఒక్కడు తప్ప. 'నీవు పండు తినకుండా ఎందుకు తిరిగి వచ్చావు?' అని గురువు ప్రశ్నించాడు.

'నిత్యుడూ, సర్వమయుడూ అయిన సర్వేశ్వరుడు లేని తావు నాకు కనిపించలేదు' అని ఆ శిష్యుడు జవాబిచ్చాడు.

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

ది. 9.12.2008 నుండి గుండుగొలను గ్రామంలో ది. 11 వరకు జరిగిన శ్రీశ్రీశ్రీ సద్గురు గీతా యజ్ఞము, ధర్మ సమ్మేళనంలో 9వ తేదీనపరమపూజ్యశ్రీ జ్యోతిర్మయానంద మాతాజీ,(శ్రీ షణ్ముఖ పరబ్రహ్మానంద ఆశ్రమం, పాలకొల్లు చేసిన అభిభాషణం సంక్షిప్తంగా ప్రచురిస్తున్నాము ) -ఎడిటర్)

సర్వాంతర్యామి,సర్వ చైతన్యస్వరూపుడు అయిన పరమాత్మకు, యజ్ఞాధిష్ఠానదైవానికి, శ్రీ బాబూజీవారి దివ్య చరణారవిందాలకు, అమ్మ చరణారవిందాలకు, పరమపూజ్యులు శ్రీశ్రీశ్రీ దండి నిర్మలానంద గిరి స్వామివారి చరణాలకు, అందరిలో ప్రకాశిస్తున్న శక్తికి హృత్పూర్వక నమోవాకములు చేస్తూ - మానవజన్మ రావటమే పునీతం. అది నీతో కొనబడింది. అనేక జన్మల పుణ్యాన్ని వెచ్చించి ఈ శరీరాన్ని కొనుక్కొన్నావు. ముంబై లాంటి పెద్ద పెద్ద నగరాలలో 11 నెలల అద్దె ముందే కట్టాలి. అలాగే ఈ దేహం కూడా అనేక జన్మల పుణ్యమనే ధనరాసి పోసి కొనుక్కొన్నాం. ఇది జనన మరణ సంసార సముద్రాన్ని దాటటానికి నావ. దానికి తెరచాప సద్గురుకృప. అనుకూల వాయువులు ఆ నావ ముందుకు సాగటానికి ఉపయోగపడతాయి. కాని నువ్వు సంసారాన్ని దాటే ప్రయత్నం చేయకపోతే ఏమైనా ప్రయోజనం ఉన్నదా? మానవజన్మ పునీతులకే వచ్చింది అని మరిచిపోతున్నాం. అజ్ఞానం జ్ఞానాన్ని కప్పివేసింది. మనకి జ్ఞానం ఉంది. అది ప్రపంచ విషయాలపై ఉంది కాని భగవత్తత్త్వాన్ని తెలిసికోవటానికి ఉపయోగ పడటంలేదు. ఈ రోజు గీతాజయంతి. భగవద్గీత బర్త్‌డే. ఎంత బాగా జరుపుకుంటున్నాం! ఇదే మనం గీతామాతకు చూపే కృతజ్ఞత.

గీత ఆవిర్భావానికి మూడు కారణాలు. అజ్ఞాన మోహాలను, శోకాన్ని పోగొట్టటానికి గీత. అర్జునుడు శోకమోహాలు వద్దని ఏడుస్తాడు. మనం కావాలి అని ఏడుస్తాం.

**న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।**
**కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా ॥**

కృష్ణా! నాకు జయమూ వద్దు. రాజ్యమూ వద్దు. సుఖమును అభిలషించటం

లేదు. రాజ్యము వలన నాకేమి ప్రయోజనము? భోగములకై బ్రతికి ఉండటం వలన ఏమి ప్రయోజనము? ముల్లోకాధిపత్యం కూడ నాకు వద్దు. ఇహలోక సుఖాలు స్థిరం కాదు. పరలోక సుఖాలూ స్థిరం కాదు అంటాడు అర్జునుడు. కాబట్టి ఏంచేయాలి?

**అథాతో బ్రహ్మ జిజ్ఞాసా** (బ్రహ్మ సూత్రాలు)

అథాతో - ఈ బ్రహ్మ జిజ్ఞాసకు అధికారి కావటానికి సాధకుడు సాధన చతుష్టయ సంపత్తి కలిగి ఉండాలి. అవి, నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రఫలభోగ విరాగము, శమదమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము. ఇవి కలిగిన తరువాతనే అర్జునుడు ఇహ పర సుఖాలు రెంటినీ విడిచిపెట్టాడు. గీత ఎటువంటి సమయంలో ఆవిర్భవించింది? కురుక్షేత్ర రణరంగంలో ఇటు ఏడు అక్షౌహిణులు, అటు 11 అక్షౌహిణుల సైన్యం మధ్య అర్జునుడు తన స్థితి అంతా చెప్పాడు. నువ్వు డాక్టర్ దగ్గరకు వెళితే డాక్టర్ " నీకు ఏమైంది?'' అని అడుగుతాడు. అప్పుడు నువ్వు నీ బాధలన్నీ ఏకరువు పెడితే ఎన్నో రకాల టెస్ట్‌లు చేయించుకొని రమ్మంటాడు. శ్రీకృష్ణుడు అర్జునుని పల్స్ చూశాడు. దేహభ్రాంతి, బంధుప్రీతి అతడిని బాధిస్తున్నాయి అని తెలిసికొన్నాడు. "వీళ్ళను చంపితే వర్ణ సంకరం అవుతుంది. పితరులకు పిండోదకాలు జరగవు కాబట్టి ఈ పని నేను చెయ్యను.

**అహోబత మహత్పాపం కర్తుంవ్యవసితా వయమ్ ।**
**యద్రాజ్య సుఖలోభేన హన్తుం స్వజన ముద్యతా ॥**

అయ్యో మనం మహాపాపం మూటకట్టుకోటానికి పాల్పడ్డాము. రాజ్యసుఖము లందు పేరాసచేత మనము బంధు జనాన్ని చంపటానికి కూడ సిద్ధమైనాంకదా! అన్నాడు అర్జునుడు.

ఒక అడవిలో మేకలు తోలుకు వెళ్తుంటే ఒక మేక తప్పిపోయింది. చీకటి పడింది. దానికి భయం వేసింది. నా యజమాని రాలేదే అని మే, మే అని గట్టిగా అరుస్తోంది. ఒక తోడేలు ఆ అరుపులను విని ఆ మేకను తినేసింది. మనంకూడా అలా అరుస్తాం. జీవుడనే మేకను కాలమనే తోడేలు తినేస్తోంది. ఈ విషయం వీడికి తెలియచేయాలి. కాని అడిగితేనే కదా చెప్పేది. అర్జునుడు స్వామికి సరెండర్ అయ్యాడు.అడిగితేనే కదా శ్రీకృష్ణ భగవానుడు చెప్పింది.

**కార్పణ్యదోషోపహత స్వభావః**

**పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢచేతాః ।**
**యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే**
**శిష్య స్తే z హం శాధిమాం త్వాం ప్రపన్నమ్ ॥**

'కులక్షయము వల్ల కలుగబోవు దోషములవలన స్వాభావిక ధైర్యం సడలి, ఏది ధర్మమో తెలియక నిన్ను అడుగుతున్నాను. కృపణత్వముతో నా మనస్సు కప్పబడినది. ఏ మార్గంలో ప్రయాణం చెయ్యాలో తెలిసికోలేకపోతున్నాను. నేను నీ శిష్యుడను. నీ శరణు జొచ్చాను. నాకు కర్తవ్యమును బోధించు. నాకు ఏది శ్రేయస్కరమో దానినే ఉపదేశించు.

**సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః ।**
**పార్థో వత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥**

ఉపనిషత్తులను గోవులుగా చేసి సమస్త ఉపనిషత్తుల సారమును ఆర్తిగొన్న అర్జునునకు అందించాడు భగవానుడు. అర్జునుడు - సుధీర్భోక్తా - దానిని బాగా గ్రహించాడు. అర్జునునిలో అటువంటి ఆర్తి, ఆవేదన, ఉన్నది కాబట్టి అతనిని దృష్టిలో పెట్టుకొని మనందరికీ చెప్పాడు.

శ్రీకృష్ణుడు అర్జునునితో- 'సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ -అంత్యకాలములో ఎవరు నన్నే స్మరిస్తూ దేహాన్ని విడుస్తారో వారు నన్నే పొందుతారు. మరణం ఎప్పుడు సంభవిస్తుందో చెప్పలేము కనుక ఎల్లప్పుడూ నన్నే స్మరిస్తూ యుద్ధం చెయ్యి' అని చెప్పాడు.

మనం తరించాలంటే సద్గురువును ఆశ్రయించాలి. గురువు చుక్కాని. శ్రీబాబూజీ మహరాజ్ వారు తమ పాదధూళితో పవిత్రం చేసిన ఈ గుండుగొలను గ్రామవాసులందరూ ఈ గీతా యజ్ఞంలో పాల్గొని పునీతులగుదురుగాక!

త్రికరణశుద్ధి లేకుండా త్రినేత్రుని సేవిస్తే త్రిగుణాలనే తిరుగలిరాయిలో చిక్కుకుంటాడు. రాగ, ద్వేష రహితుడు కాకుండా చేసే రామనామ స్మరణ రోగిని చేస్తుంది కాని యోగిగా మార్చదు. మాత్సర్యాన్ని మట్టుపెట్టేది మాధవ నామము. వైరాగ్యాన్ని పెంపొందించేది విశ్వేశ్వర స్మరణ.

\- కాళీబాబు

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

క్షణం కూడా ఆలస్యం లేకుండా జని ఒక కాగడా లాంటిది పట్టుకొని నామదేవుణ్ణి వెతకటానికి బయలుదేరింది. దామాశెట్టి ఆమెను అనుసరించాడు. గుళ్ళు, ఇసుక తిన్నెలు అన్నీ వెతికారు. చివరకు పుండరీకుడి గుడి గోడకు ఆనుకొని తలవాల్చి నిద్రపోతున్న నామ కనిపించాడు. ఒంటి మీద చినిగిపోయిన గోచిపాత తప్ప ఏమీ లేదు. కాని ముఖం మాత్రం ఒక అలౌకికమైన దివ్య కాంతితో వెలిగిపోతున్నది. బ్రతిమాలి ఇంటికి తెచ్చి బట్టలు కట్టించి పడుకోబెట్టారు.

తెల్లవారి అందరూ లేచిచూసేసరికి నామాపడుకున్న కుక్కి మంచం ఖాళీగా ఉంది. ఇంట్లో వాళ్ళు కాకడ ఆరతికి వెళ్ళి ఉంటాడు అనుకున్నారు. ముందు జని బయలుదేరింది నామదేవుణ్ణి వెతుకుతూ. దామాశెట్టి కూడా బయలుదేరాడు. నామదేవుణ్ణి వెతుకుతూ పుండరీకుడి గుడి ముందుకు రాగానే కళ్ళు తిరిగినట్లై పడిపోయాడు. ఎవరో ముఖంపైన నీళ్ళు చల్లి పిలుస్తుంటే తెలివి వచ్చింది. ఎవరో మంచినీళ్ళు అందించారు.

అంతలో ఒక దొమ్మరివాడు అక్కడకు వచ్చాడు. అతడు దామాశెట్టితో దైవం అనుకూలిస్తే అన్నీ మీ కాళ్ళ దగ్గరకే వస్తాయి. దైవం ప్రతికూలిస్తే మనం ఎంత ప్రయత్నం చేసి ఏమీ లాభం ఉండదు. నా సంగతే చూడండి. నేను ఇక్కడి దొమ్మరిని. నా పేరు వాసుదేవ్. నిన్న ఇక్కడ పాములాడించాను. వేణువు మీద మధురంగా పాడుతూ నృత్యం చేశాను. కాని దైవం అనుకూలించలేదు. ఎవ్వరూ ఒక్కపైసా రాల్చలేదు. మంగళ వేఢ సంతకు వెళ్ళాను. అక్కడ ఎవరో శెట్టిట, శెట్టేమిటి, సాక్షాత్తు నా పాలిట కృష్ణుడే, బట్టలు దానం చేస్తూ. నేను వెళ్ళేసరికి అన్నీ అయిపోతే ఇవిగో తన ఒంటి మీది బట్టలు ఇచ్చిపోయాడు. ఇవిగో ఆ దేవుడు దయ తలచి ఇచ్చిన జరీ పంచె, జరీ అంగీ అంటూ చూపించాడు. వాడి కళ్ళ వెంట అశ్రుధారలు కారిపోతున్నాయి. వాడు తన కళ్ళ ఎదురుగా నామదేవుడి రూపంలో కృష్ణుడు దర్శనం ఇస్తుంటే, ఆ కృష్ణుణ్ణే చూస్తూ మాట్లాడుతున్నట్లున్నది.

ఆ బట్టలు చూడగానే దామాశెట్టి ఒక్క ఉదుటున లేచి కూర్చున్నాడు. ఏడీ? ఎక్కడ? ఆ బట్టలు ఇచ్చిన అతను అని అడుగుతూ. వాసుదేవ్

ఎక్కడేమిటి? ప్రొద్దున ఇక్కడే విఠలా! విఠలా! అంటూ నృత్యం చేస్తున్నాడు. ఇప్పుడు విష్ణు పాదాల దగ్గర ఉండవచ్చు అన్నాడు.

విష్ణు పాదాలవైపు పరుగులాంటి నడకతో వెళ్ళాడు దామాశెట్టి. తన సర్వస్వాన్నీ లోకాన్నీ అన్నీ మరచి ఆత్మచింతనలో లీనమైన నామదేవుణ్ణి అతిప్రయత్నంతో ఈ లోకంలోకి తీసికొనివచ్చి ఇంటికి రమ్మనమని బ్రతిమాలాడు. నామదేవుడు ఈ లౌకిక వ్యాపారాలు తనవల్ల కాదని, పాండురంగడు అనుమతిస్తే తప్ప ఇంటికి రాననీ చెప్పి గుళ్ళోకి వెళ్ళాడు. నామదేవుడికి అంతర్వాణి స్పష్టంగా వినిపించింది ఇంటికి వెళ్ళి, తల్లిదండ్రులను బాధపెట్టకుండా మసలుకోవాలి అని. అప్పుడే అక్కడికి వచ్చిన వాసుదేవ్ దామాశెట్టికి నమస్కరించి 'నిన్న మీ అబ్బాయి నాకు దానంగా ఇచ్చిన వస్త్రాలు ఇవిగో, వాడివి వాడికే తిరిగి అర్పిస్తున్నాను. దేవుడిచ్చిన దానిని తిరిగి దేవుడికి ఇవ్వటంలోనే సుఖము, చరితార్థత ఉన్నాయి.' అంటూ అర్ధ నగ్నంగా ఉన్న నామదేవుడిపై ఆ వస్త్రాలు కప్పాడు. వాసుదేవ్ ఇప్పుడు నామదేవుడి పైన కప్పిన వస్త్రాలు మామూలు వస్త్రాలు కాదు. అవి జ్ఞాన వస్త్రాలు. అవి కప్పగానే నామదేవుడికి తన మనస్సును అంతవరకు కప్పిన పొర ఏదో తొలగినట్లైంది. భగవద్భక్తి, ఉన్నవాడికి సంసారం అంటే భయమెందుకు? సంసారంలో ఉంటూనే, తల్లి దండ్రులకు ఆసరాగా ఉంటూనే భగవన్నామం చేసుకోవచ్చు. నామ మాహాత్మ్యం అందరికీ తెలియజేయవచ్చు. సంసారంలో ఉంటూ నామం చేసుకోకూడదని ఏ దేవుడూ చెప్పలేదే.

నామదేవుడికి పాండురంగడు తన కళ్ళు తెరిపించినట్లు అనిపించింది. అతడు నూతనోత్సాహంతో తల్లిదండ్రుల భుజాలమీద చేతులువేసి ఇంటికి బయలుదేరాడు. వాళ్ళు ఇల్లుచేరేసరికి, ఇంటి దగ్గర సదావర్తిశెట్టి వీరికోసం ఎదురు చూస్తు ఉన్నాడు. మాట్లాడుకోవటాలు, జాతకాలు చక్కగా కుదరటం అన్నీ క్షణాల మీద జరిగిపోయాయి. ఒక శుభముహూర్తంలో సదావర్తిశెట్టి కూతురు రజాయి నామదేవుడి ధర్మపత్ని అయింది. వివాహం అయినా నామదేవుడి దినచర్యలో మార్పులేదు.

ఒకరోజు పవళింపు ఆరతి జరుగుతున్నది. ఘంటానాదం మోగుతున్నది. ఉన్నట్లుండి ఒక్కసారిగా బాహ్యశబ్దాలన్నీ హరించి ఒక అభౌమమైన నిశ్శబ్దం అంతటా ఆవరించింది.

-సశేషం

# ఉదంక మేఘాలు

-శివ ప్రసాద్

శ్రీకృష్ణుడు అందరినీ వీడ్కొల్పి హస్తినాపురం నుండి ద్వారకకు బయలుదేరాడు. సాత్యకి, సుభద్ర రథాలలో అనుసరిస్తున్నారు. మలయపవనుడు తన పిల్ల తెమ్మెరలతో సేద తీరుస్తున్నాడు. ఇంద్రుడు హరిమీద పూలనావ కురిపించాడు.

అలా ప్రయాణిస్తూ ఆ లీలామానుష విగ్రహుడు మార్గానికి సమీపంలో ఉన్న ఉదంక మహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. అత్యంత వినయంతో ఆ మునికి నమస్కరించి, ఆయన సమర్పించిన అతిథి సత్కారాలను స్వీకరించి ఆసీనుడైనాడు. అప్పుడు ఉదంకుడు ..........

ఉద - (ఏమీ తెలియనివానిలా నర్మగర్భంగా మనస్సులోని కోపాన్ని, నిందను మాటలలో బయటపడనీయకుండా) శ్రీకృష్ణా! నీవు భరతకులాలంకారుల వద్దకు సంధికుదర్చటానికని చెప్పుకుంటూ వెళ్ళావు. కాని సామర్థ్యం కలిగి ఉండీ యుద్ధాన్ని నివారించావుకాదు. అయినవాళ్ళ మధ్య యుద్ధం జరిగేలా చేసి, ఎందరినో హతులను చేసి చివరకు మిగిలినవారిని మహారాజ్యాలకు అధిపతులుగా నిలబెట్టావు. జనులకందరికీ సంతోషాన్ని కలిగించావు. ఏ దురితమూ చేయనివాడవనిపించుకున్నావు. నిన్ను పక్షపాతి అని ఎవరైనా ఎలా అనగలరు?

శ్రీకృష్ణుడేమన్నా తక్కువ తిన్నాడా! తను అంతకన్న ఏమీ ఎరుగనట్లు ఆ భార్గవుని ముఖంలోకి చూస్తూ..........

**కృష్ణ** - ఓ మహామునీ! నేను ధార్తరాష్ట్రులకు మెల్లగా హితవు చెప్పిచూశాను. వారిని అదిలించాను. భయపెట్టాను. ఆఖరికి పాండవులైదుగురికి అయిదు ఊళ్ళు ఇచ్చినా చాలు, సంధి కుదిరి యుద్ధం ఆగిపోతుంది. అపారమైన ప్రాణనష్టం తప్పిపోతుంది అని దీనంగా అర్థించాను. భీష్ముడు, ద్రోణాచార్యుడు కూడా నన్ను సమర్థించారు. దుర్యోధనుడికి చాల చెప్పి చూశారు. కాని అతిలోభం వలన యుద్ధోన్మాది అయిన దుర్యోధనుడు సంధి కుదరనీయలేదు. ధార్తరాష్ట్రులు వారికి సాయంగా వచ్చినవారు పాండవులతో యుద్ధం చేశారు. పాండునందనులు అయిదుగురూ తప్ప మిగిలిన వారందరూ ఆ ధర్మయుద్ధంలో వీరమరణం పొంది ఉత్తమ లోకాలకు వెళ్ళారు. కాలనియతిని దాటటం ఎవరికి శక్యం!

**ఉదం** - (అది విని కోపంతో ఊగిపోతూ కళ్ళెఱ్ఱచేసి) కృష్ణా! నీవు యుద్ధం

నివారింప సామర్థ్యం కలిగిఉండి కూడ, సంధి పొసగకుండ చేసి, మిథ్యాచారుడవై కౌరవకులాన్ని నాశనం చేశావు. ఇప్పుడే నీ పాపానికి తగిన ఘోరశాపాన్ని ఇస్తాను.

**కృష్ణ** - మునీంద్రా! మీవంటి మహనీయులకు కోపం శోభిస్తుందా? శపిస్తే ఎంతో కఠోరమైన తపస్సు చేసి, అర్జించిన ఫలం, బ్రహ్మతేజము నశించిపోవా? శాంత చిత్తంతో నేను చెప్పేది పూర్తిగా విని, ఆ తరువాత నీకు ఎలా మంచిదని తోస్తే అలాగే చెయ్యి.

**ఉదం** - (ఇంకా కోపంగా) తపస్సు నశిస్తుందా! అయితే అవుగాక. కాని నేను నిన్ను మాత్రం వదలను. అయినా నీవు చెప్పదలచుకున్నదేదో చెప్పు. అది కూడ వింటాను. నీవు చెప్పింది తృప్తికరంగా ఉంటే శాపోన్ముఖమైన నా మనస్సును వెనక్కు మరలిస్తాను.

**కృష్ణ** - ఓ ఉదంకా! తమము, రజస్సు, సత్త్వము నా వశవర్తులై ప్రవర్తిస్తుంటాయి. మరుద్గణాలు, వసువులు, స్వర్గాదులు అన్నీ నానుండే ఉద్భవిస్తాయి. అన్నింటిలో నేనే నిండి వ్యాపించి, వాటిని నేనే ధరించి ఉంటాను. అన్నీ నాలోనే పుట్టి, నాలోనే ఉంటూ, నాలోనే లయం అవుతాయి. అపర, పర అనే తత్త్వాలు రెండూ నేనే. ఓంకారాది వేదములు, చాతుర్వర్ణములు, చతుర్విధ ఆశ్రమములు, సకల కర్మజాతము, స్వర్గమోక్షాదులు అన్నీ నా మయమేనని, నాకన్న వేరు కాదనీ తెలిసికో. యజ్ఞయాగాదులతో నన్ను స్తుతించి, కొందరు కోరిన ఫలాలను పొందుతారు. కృతార్థులు కాగలుగుతారు. దోషదూషితులు కూడ ప్రాయశ్చిత్తాదులతో నన్ను భజించి, ఇష్టఫలాలను పొంది కృతార్థులు కాగలుగుతారు. మన్మధుడు నా అగ్రతనయుడని తెలియుము. జగద్రక్షకుడనై కాలోచితంగా అవతారాలను ధరించి ధర్మమును నేనే పరిరక్షిస్తుంటాను. ఉత్పత్తి, స్థితి, లయములను బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే పేర్లతో నేనే నిర్వహిస్తుంటాను. ధర్మగ్లాని సంభవిస్తే జగద్రక్షణార్థం అధర్మాన్ని శిక్షించి, ధార్మికులను రక్షిస్తాను. అట్టివాడనై ఉండీ నేను అధర్మపరులైన ధార్తరాష్ట్రులను అత్యంత ధార్మికులైన ధర్మనందనాదులతో కలుపుదామని ఎన్నో అవస్థలు పడ్డాను. దివ్యజ్ఞాన దేదీప్యమాన మానసులైన వ్యాసుడు మొదలైన మునులందరూ దీనిని గ్రహించారు. కాని దురాత్ములై నేను చెప్పినది పెడచెవిని పెట్టి, కౌరవులు సంధికి ఒడబడక పాండునందనులతో యుద్ధం చేసి హతులైనారు. అయినా ఆ ధర్మయుద్ధంలో వీరమరణం పొందినవారందరూ ఉత్తమలోకాలు పొందారు. నేను చేసినదిది. అంతా విన్నావు కదా భార్గవా! ఇప్పుడు ఇక నీ ఇష్టం. ఏమి చేయదలచుకున్నావో చెయ్యి.

-సశేషం

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**చిన్తామణి ర్జయతు సోమగిరి గురుర్మే ।**
**శిక్షా గురుశ్చ భగవాన్ శిఖిపింఛ మౌళిః ।**
**యత్పాద కల్పతరు పల్లవ శేఖరేషు ।**
**లీలా స్వయం వర రసం లభతే జయశ్రీః ॥**

శ్రీకైవల్యపదం చేరటానికి లోకంబులు లోకేశులు లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెంజీకటికి అవ్వల ఏకాకృతి వెలుగు భగవంతుణ్ణి సేవించి ఆస్వాదించి, ఆ భగవంతుడి దివ్యలీలలను, విశేషించి, ఆనందాంగనా డింభకుడి బాల్యలీలలను ఎంతో రమ్యంగా, హృదయాలు ఆర్ద్రమై పులకించేలా పోతనామాత్యుడు భాగవతంలో వర్ణిస్తే, తన గిరిధర్‌తో కలిసి ఆడిపాడి ఆ ప్రభువు చరణదాసిగా, ఆ శ్రీకృష్ణుణ్ణి అనుభవించి, అనుభవించి, ఆ లీలాకేళీ విలాస మాధుర్యాన్ని మనందరకు మీరాతల్లి ప్రసాదిస్తే, శ్రీవత్సాంకితుడు, పీతవసన వనమాలి, చందనచర్చిత నీలవపుషి అయిన రాధామాధవుడు రాధతో సలిపిన రహఃకేళి రహస్యార్థాన్ని జీవబ్రహ్మైక్య పరంగా శృంగార రసంలో రంగరించి భక్తజయదేవ కవి అందిస్తే, శ్రీకృష్ణ రసాయనంలో పూర్తిగా కరగిపోయి, దానితో ఏక స్వరూపం పొందిన స్థితిలో, ఆ కృష్ణరసాయనాన్ని, శ్రీకృష్ణ కర్ణామృతము అనే గ్రంథరూపంలో మనందరకు అందించిన మహనీయులు శ్రీలీలాశుకులు.

వీరు చింతామణి అనే మహనీయుని సౌంజ్ఞను అనుసరించి సోమగిరి యోగి అనే గురుదేవులను ఆశ్రయించి, శ్రీగురుదేవుల అనుగ్రహంతో శ్రీగోపాల మంత్ర సిద్ధిని పొందినట్లు జనశ్రుతి.

ఈ మొదటి శ్లోకంలో వారు గురువందనంతో మంగళాచరణం చేస్తూ అనుబంధ చతుష్టయాన్ని కూడా అందులోనే ఎంతో మనోహరంగా పొదిగారు.

అనుబంధ చతుష్టయంలో మొదటిది అధికారి. శ్రీకృష్ణనామం చెవిని పడగానే ఎవరి ఒడలు పులకించి, హృదయం పురి విప్పిన నెమలిలాగ నాట్యం చేస్తుందో ఎవరి మనసులు గోపికా భావాన్ని పొంది, వ్రజాంగనలుగా మారి ఆ బాలకిశోరాన్ని పరివేష్టించి ఉంటారో, వారందరూ అధికారులే. అటువంటివారు ఈ గ్రంథాన్ని చదివినా, శ్రవణం చేసినా, సద్యోముక్తిని పొందుతారు.

రెండవది వస్తునిర్దేశము. ఉన్న వస్తువు ఒక్కటే. అదే బాలకిశోరంగా అందరినీ అలరిస్తున్నది.

మూడవది సంబంధం. బాగా ఆకలిగొన్నవాడి ముందు పంచభక్ష్య పరమాన్నాలు ఉన్న పళ్ళెం ఉంటే, వాటితో వాడికి ఎటువంటి సంబంధం ఉంటుందో, పాఠకులకు శ్రీకృష్ణ కర్ణామృతంతో అటువంటి సంబంధమే ఉంటుంది.

నాల్గవది ఫలం. ఈ గ్రంథాన్ని చదివి లేదా శ్రవణం చేసి, మననం చేసి, గోపికా భావాన్ని పొంది, ఆ శ్రీకృష్ణ స్వరూపాన్ని ఆనందంగా అనుభవిస్తూ పరవశించి, ఆ రసంతో ఏకరస స్వరూపంగా కావటమే ఫలం.

అంతేకాదు, శ్రీగురుదేవులకు, జీవులను కరుణించి వారికి ఇంద్రియ గోచరం కావటానికి బాలకిశోర రూపంతో భాసిస్తున్న శ్రీకృష్ణ పరబ్రహ్మమునకు అభేదమని, శిఖిపింఛమౌళి శిక్షా గురువు, జగద్గురువు అయిన కల్పవృక్షము వంటి శ్రీగురుదేవుల చరణపల్లవములకు ప్రణిపాతం చేసి శరణుపొందనిదే భగవదనుభూతి కలగదు అని, ఆ సాక్షాత్కారానుభూతి అనేది సాధనతో సంపాదించటానికి వీలయ్యేదికాదు అని పాత్రత సంపాదించి, అధికారులై శ్రీగురుపదపల్లవములకు శిరస్సు వంచి నమస్కరించి శరణుపొందినవారిని, జయశ్రీ అంటే ఆత్మానుభూతి లేదా భగవంతునితో ఏకరసంగా అయిన అనుభూతి తానే లీలా స్వయంవరంలో స్వయంగా పూలమాలవేసి వరిస్తుంది అని చెప్తూ బ్రహ్మము దేనికీ విషయం కాజాలదు అన్న సత్యాన్ని కూడ శ్రీలీలా శుకులు స్వానుభవప్రమాణంగా ఈ శ్లోకంలో చాటిచెప్తున్నారు. *

**సంకల్ప రహితమైతే శంకర సాక్షాత్కారం లభిస్తుంది. వాసనా రహితమైతే వాసుదేవుని సాక్షాత్కారము లభిస్తుంది.**

**రాధామాధవ స్మరణ రాగద్వేషాలను మటుమాయం చేస్తుంది. పరిమళాన్ని వెదజల్లేది పారిజాతము. పాపాన్ని పారద్రోలేది పరమశివుని పావన నామము. చింతలను రూపుమాపేది శివనామము. క్లేశములను తొలగించేది కేశవ నామము.**

**సంకల్పాలనే దోమలను, చింతలనే చీమలను పారద్రోలేది పరమేశ్వరుని పావన నామము.**

**-కాశీబాబు**

## మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

మార్చి 27 నుండి ఏప్రియల్ 2వ తేది వరకు శ్రీకాళీవనాశ్రమంలో మౌన ధ్యాన సప్తాహ శిబిరం నిర్వహింపబడింది. ఈ శిబిరంలో 75మంది భక్తులు పాల్గొన్నారు. మార్చి 30వ తేదీన శ్రీ మాతాజీ మధ్యాహ్నం 1గం. నుండి గం2.30 ని.ల వరకు సాధకులకు ధ్యానం గురించి కలిగిన సందేహాలను తీర్చారు. ఈ శిబిరంలో మాతాజీ వారు చేసిన అనుగ్రహభాషణలను సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము. - ఎడిటర్

ఓం శ్రీ నాథా గురు మహరాజా -ధ్యానానికి కావాల్సింది నమ్మకం. అన్నం ఉడికిందో లేదో చూడాలంటే అన్నం అంతా చూడక్కర్లేదు. ఒక మెతుకు పట్టుకు చూస్తే చాలు. అలాగే ఇక్కడ మనమంతా చేరి స్వామివారు ప్రసాదించిన ఈ గొప్ప అవకాశాన్ని చక్కగా వినియోగించుకుంటే చాలు. సాధన సత్ఫలితాలను ఇస్తుంది. నేను ఇంట్లో పారాయణ చేస్తూఉన్నా నా మనస్సు బృందావనంలో జరిగే ఈ కార్యక్రమంపైననే ఉన్నది - ఇప్పుడే ప్రార్థన అయింది. సంకీర్తన అయింది.సంకీర్తనలో నామం జరుగుతుంటే నా మనస్సు అందులో లయించి ఆ స్వామి నామంతో రమిస్తోంది. నామం విన్నంతసేపు మనస్సు పరమాత్మపైననే నిలిచి ఉన్నది. 9 గంటలకు ధ్యానానికి రావాలంటే శ్రద్ధ ఉండాలి. ఏది ముఖ్యమో ఆ సేవ నిర్ణీత సమయానికి చేసికోవటం మనమీద ఆధారపడి ఉంటుంది.

మనం స్నానం చేసి విడిచిన బట్టలు నీటిలో ముంచి ఎలా శుద్ధి చేస్తామో అలాగే మనలోని దోషాలను హరింపచేసికోవాలంటే నా, పర భేదాలు పోవాలి.

స్వామి మూటికి సాక్షి అయినవారు. నిరంతరం ఆత్మానందంలో ఓలలాడే త్రిమూర్తి స్వరూపులు. త్రిగుణములను రహితం చేసేవారు.

ఏది చేయాలన్నా ఒక నమ్మిక ఉండాలి.. భగవంతునిలో మనం ఉన్నాం. అనుభూతిని పొందుతున్నాం. ఇప్పుడు భగవంతుడు ఎక్కడ ఉన్నాడూ? మనలోనే ఉన్నాడు. కాశీ వెళ్తాం. భగవద్దర్శనానికి లైన్‌లో వెళ్తాం. బయటకు వచ్చి స్థల చరిత్ర చూస్తే కాశీక్షేత్రమంతా లింగమే అని తెలుస్తుంది. అమ్మ కడుపులో ఉన్నప్పుడు నీ కాళ్ళు అమ్మలో ఉన్నాయి.

ఆ కాళ్ళతో నువ్వు తన్నావుకూడా. అలాగని పుట్టిన తరువాత అమ్మను కాళ్ళతో తంతావా? అలాగే శివుని అక్కడ ఒకరూపంలో దర్శిస్తాం. అభిషేకాలు చేస్తాం. శిరస్సును ఆనిస్తాం. వచ్చిన తరువాత నువ్వు ఎక్కడ ఉన్నావు? శివలింగంపైనే ఉన్నావు.

గురుదేవుల పాదాలకు శిరస్సు అనించవయ్యా అంటాను. ఆ పాదముద్ర నమ్మిన భక్తునికి, ఆ పాదాన్ని విశ్వసించినవాడికి ఎంత అనుభూతి కలుగుతుంది? నేను షోలాపూర్ వెళ్ళినప్పుడు ముగ్గుతో పాదముద్రలు వేశారు. నేను వాటిని తొక్కకుండా దాటుకుంటూ వెళ్ళాను. మనం వాటిని తొక్కగలమా? అలాగే గురుపాదాలను ఒక అట్టమీద వేశాం అనుకోండి. దానిని పూజనీయంగానే చూస్తాము అంతకుముందు వైట్ గా ఉన్న అట్టే కదా! ఏమైంది? అదే గుర్తింపు. భగవంతుడు ఉన్నాడు అన్న విశ్వాసం.

ఆస్తి పాస్తులు మనతోఎంతవరకు వస్తాయి? ఖర్చు లేకుండా చేసేది గురుదేవుడే. "నువ్వు నా బిడ్డవు రా'' అని దరికి చేర్చుకొన్నారు. పొదుపు అన్నది వారి దగ్గరే నేర్చుకోవాలి. న్యూస్ పేపర్‌లోని తెలుపు ఖాళీలలో వ్రాస్తే బాగుంది బాగుంది అనేవారు. ఇప్పుడు అలా చేస్తున్నామా? కాని ఆ అనురక్తి. ఆ అవగాహన మన స్వామిని గుర్తు చేస్తాయి. ఆ సన్నివేశం గుర్తుకు రాగానే ఆ అనుభూతి కలుగుతుంది.

ఉత్తరం వ్రాస్తే చుట్టూఉన్న ఖాళీస్థలంలో వ్రాయి అనేవారు. ఇప్పుడు మనం అలా చేస్తున్నామా? ఒక వస్తువు ఖరీదు పావలా(25 పైసలు) చెప్తే 5 పైసలనుంచి బేరం చేసేవారు. చివరకు 15 పైసలకు కొనేవారు. మన జీవితంలోకి తొంగి చూస్తే నిత్యకాలంలో జమ అయ్యేది ఎంత? ఎంతవరకు మంచిని గుర్తిస్తున్నాము? మన జీవితమనే తెల్ల కాగితాన్ని ప్రక్కనపెడ్తున్నాం. స్వామి సన్నిధిలో ఆలోచనలు చేస్తున్నాం. వాటిని తొలగించుకోవటానికే మనం చేసే ఈ ధ్యాన ప్రక్రియ.

ఈ తనువు ఇంతవరకు ప్రకాశిస్తోంది అంటే ప్రాణంతోఉన్నది కనుక దానికి కారణం ఏది? మనలో ఉన్న చైతన్యం. దానిని ఎవరు ఇచ్చారు? మన అమ్మ, నాన్న ఇచ్చారా? ఈ దేహం రావటానికి ఎవరు కారణం? ఈ రోజు ఇక్కడ శ్రీ సద్గురుదేవుల సన్నిధిలో కూర్చుని ఆ ప్రభువు తత్త్వాన్ని గుర్తు చేసుకొంటున్నా మంటే అది వారి కృప. వారు ఒక

కీర్తన మనకు ఇచ్చారు

మరువని తల్లివి తండ్రివి నీవని నెరనమ్మితిరా శ్రీరంగా,
మొరవిని పాలించే దొరవని శరణంటినిరా గరుడతురంగా
॥పాలించరారంగా॥

ఈ కీర్తన స్పీడ్‌గా సాగదు. ఈ కీర్తనను గంట, గంటన్నరసేపు స్వామి పాడించుకొనేవారు. ఎక్కడ? యాత్రలో ట్రైన్‌లో. అమ్మ చేత (కామేశ్వరీ ప్రసాద), నా చేత. మనని ఎవరు పాలిస్తున్నారు? మన తలిదండ్రులా? మనంతినే అన్నం మనని పాలిస్తోందా? ఒక పవర్ ఉంది. అదే ఆధారం. అది ఆశ్రయం ఇచ్చింది. ఆ ఆశ్రయం ఇచ్చింది ఎవరు? గురుదేవులు. మనకు ఆ గుర్తు తెలిపేవాడు గురుదేవుడే. మీరు పిల్లలను కని వారిని మర్చిపోకుండా ఉన్నారా? ప్రొద్దుటే హాట్ కాఫీ త్రాగుతూఉంటే పిల్లవాడికి పాలు పట్టే విషయం జ్ఞప్తికొస్తుందా? గురుదేవుల కుక్షిలో పడితే అది ఎంతమందికి ఆధారమైనదీ నా అనుభవంలో ఉన్న విషయం.

మన్నుతిన్నావా? అని అడిగింది యశోదమ్మ.

లేదమ్మా, వీళ్ళు చాడీలు చెపుతున్నారు అన్నాడు కిట్టయ్య

నోరు తెరు అని యశోదమ్మ అంటే నోరు తెరిచాడు బాలకృష్ణుడు. సత్యాన్ని వెలుగు పరచమంటే అందులో మన్ను ఏమిటి? సర్వం కనిపిస్తుంది. మొత్తం ప్రపంచం అంతా కనిపించింది. అప్పుడు యశోదమ్మ ఎక్కడ ఉంది? ఆ ప్రపంచంలోనే. మానవుడు ఎక్కడికి వెళ్ళినా ఏమి చూసుకుంటాడు? తన పేరు ఎక్కడ ఉందా అని. తన ఫోటో పడిందా లేదా అని. ఇది మనకీ అనుభవంలో ఉన్నదే కదా - టి. వీ లో బాబూజీతో మనని చూపిస్తే అందులో మనం ఎక్కడ ఉన్నాం? అని చూస్తాం. బాబుగారిని వదిలేస్తాం కాని ఆయన మనలను వదలరు. వదిలితే మనం ఉండం.తనువు అనే మాయలోపడి తనను మర్చిపోతున్నాడు మానవుడు.

మనసున నీ స్మృతి మాయక మునుపే
కనులను పొరలూ మూయక మునుపే
కనరారా నీ కమనీయాకృతి కనియెద మనసారా
రంగా కనియెద మనసారా

కనులను పొరలు - మనస్సు ఇంతవరకు ఎందులో రమత చెందిఉన్నదో గమనించాలి. మొదటి రెండు రోజులు కొంచెం కష్టమే.మనస్సు తన చేష్టలను

చూపిస్తుంది. ఇక్కడ కూర్చుంటే సాధన చక్కగా జరుగుతుంది. రోజూ మనం 10 గంటలకు జరిగే ధ్యానంలో కూర్చుంటున్నామా? 11 గంటలకు సంకీర్తనకు వస్తామా? బోల్డు పనులు! ఇందిరా గాంధీ పోతే ఏ పని ఆగింది? రాజీవ్ గాంధీ పోతే ఏ పని ఆగింది? ముగ్గురు గాంధీలు పోయారు. ఏది ఆగింది? ఈ సమయం దాటిపోతే తిరిగి రాదు. మనస్సులో భగవంతుని స్మృతి మాయక మునుపే - 'అవధీరిత శారదార విందౌ చరణౌ మరణేపి చింతయామి' అని కులశేఖరులవారు ముకుందమాలలో అన్నారు. అదే విషయాన్ని

**అనన్యాశ్చింతయంతోమాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం ॥**

స్మరణ. మృతి అనే మాటలను మాటి మాటికి స్మరణకు తెస్తాడు గీతాచార్యుడు. ఆ మననమే భగవద్రూపమైంది.

రాత్రి పోయేది తాత్కాలిక నిద్ర. శాశ్వత నిద్ర అయితే దేహం పనికి రాదు. దేహం ఉండగానే భగవంతుని గుణగణాలను అనుభవించాలి. 'భగవంతుడి గుణాలను అలవరచుకో. భగవంతుడిలో లేని గుణాలను తీసివేసుకో' అనేవారు గురుదేవులు.

కనులకు పొరలు ఎందుకు వస్తున్నాయి?నేను, నేను అనే భ్రాంతి వల్ల పొరలు వస్తాయి. ఆ పొరలు తొలగించేవారు గురునాధులొక్కరే.

కనరారా నీ కమనీయాకృతి కనియెద మనసారా

కన్నులారా అనలేదు. మనస్సనే చక్షువుతో ధారణ చేస్తే ప్రతి అణువు, ప్రతి అలికిడి, ప్రతి శ్వాస దాని దృష్టిలో ఉంది. ఆ ఆకృతి కమనీయమైనది. అనంతమైన అనుభూతిని కలిగించేది. కన్నుకు కనిపించని వస్తువు వేరుగా ఉన్నది. అది కన్నుకు కన్ను అయి ఉన్నది. చేతిలో సుత్తి పట్టుకుని ఏమిటిది? అంటే సుత్తి అంటావు. కాని దానిని పట్టుకొన్న చేతిని చూడవు. మన చేయిని పట్టుకొన్న హృదయాంతరంగుడి కమనీయాకృతిని మనస్సనే చక్షువుతో చూడాలి. నేను కరులను, హరులను, మణిమందిరాలను సురభోగాలను కోరటంలేదయ్యా! పునరావృత్తి లేని స్థితిని ప్రసాదించు ప్రభూ! ఈ ప్రపంచం అనే వాతావరణానికి లోనుకాకుండా నీలో రమించేటట్టు చెయ్యి' అని కోరుకోవాలి. అట్టి భక్తిని, శక్తిని సాధనా సంపత్తిని గురుదేవులు ప్రసాదించెదరు గాక! సుఖీభవ! సుఖీభవ!!

# శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమము, హైదరాబాద్ సత్సంగ సమావేశములు

-నివేదిక

డా॥ రామతారక పరబ్రహ్మ ప్రసాద్‌గారు వార్షికోత్సవం అంటే ఏమిటో వివరించారు. పాఠశాలలోవలె ఇక్కడ సంవత్సర పరీక్షలు ఉండకపోయినా, ఇంతవరకు ఈ సంవత్సరంలో ఎవరికివారు తాము ఆధ్యాత్మికంగా ఎంత ప్రగతిని సాధించారో తమకుతామే పరిశీలించుకునే సమయం ఇది.

వేరే సాధనలు ఏమీ చేయకపోయినా, శ్రీబాబూజీ చెప్పినట్లు కనీసం రెండు పూటలా ప్రార్థన తప్పక చేస్తే కూడ చాలు. అసలు ఆశ్రమానికి వస్తుంటేనే కొన్ని మార్కులు వస్తాయి. ఆశ్రమానికి వచ్చి అటూ ఇటూ పోకుండా కూర్చుంటే ఇంకా ఎక్కువ మార్కులు వస్తాయి. ప్రక్కవాళ్ళతో అనవసరంగా మాట్లాడకుండా కూర్చుంటే కూడ చాలు, శ్రవణం చేయగలశక్తి లేకపోయినా సరే మార్కులు వస్తాయి. ఎందుకంటే ముందు శరీరం కదలకుండా కూర్చుంటే, తరువాత మనస్సు కదలకుండా కూర్చోవటం అలవాటు అవుతుంది. ధ్యానానికి కదలకుండా నిశ్చలంగా కళ్ళు మూసుకొని కూర్చోవాలి.

నేను చిన్నప్పుడు ఆశ్రమంలో ఉన్నప్పుడు అక్కడ మా గురువుగారు మాకు హిందీలో చెప్పేవారు. ఏమని అంటే నీవు నిద్రపోకుండా ఉంటే మంచిది. కాని ఒక్కొక్కప్పుడు నిద్రవస్తుంది. నిద్రపోయినా ఫరవాలేదుకాని, నిద్రపోతూ ప్రక్కవాడి మీద పడవద్దు. ఎందుకంటే నీవు అలా చేసినందు వలన ప్రక్కవాడి నిద్ర ఖరాబు అవుతుంది కనుక అని.

మాఘమాసం ప్రవేశించబోతున్నది కనుక అందరూ ఆదిత్యహృదయం పారాయణ చేయటం అన్ని విధాల శ్రేయస్కరం. ఆశ్రమంలో అయితే ఈ మాఘమాసం అంతా ఉదయం ప్రార్థనలో ఆదిత్యహృదయం కూడా చేరుస్తారు. ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ అని కదా. ఆదిత్యహృదయం పారాయణ చేసినందు వలన ఆరోగ్యమే కాక కార్యసిద్ధి కూడా కలుగుతుంది. ఈ ఆదిత్య హృదయాన్ని పారాయణ చేసే రాముడు రావణాసురుని వధించాడు. పైగా శని సూర్యుడి కొడుకే గనుక, ఆదిత్య హృదయం పారాయణ చేసేవారి యెడల ప్రసన్నుడై, వారిని ఎక్కువ బాధలు పెట్టకుండా వదిలేస్తాడు.

ఆంజనేయుడు భాస్కరునికి శిష్యుడు. ఆంజనేయుడికి సూర్యుని పుత్రిక అయిన సువర్చలతో వివాహం అయినట్లు చెప్తారు. 'సు' అంటే ఆత్మవస్తువు. 'వర్చల' అంటే వర్చస్సు లేదా ప్రకాశం కలిగినది అని అర్థం. ఆంజనేయుడికి సువర్చలతో వివాహం అయింది అంటే, హనుమంతుడు

సూర్యుని వద్ద నుండి ఆత్మప్రకాశాన్ని గ్రహించాడు అని అంతరార్థం. ఆదిత్య హృదయంతోపాటు హనుమాన్‌చాలీసా కూడా పారాయణ చేస్తే నెరవేరని కార్యాలు కూడా నెరవేరతాయి అని తమ అనుభవాన్ని వివరించి, రోజూ పారాయణ చేస్తామని వాగ్దానం చేసినవారికి ఆదిత్యహృదయం, హనుమాన్ చాలీసా తెలుగులిపి, నాగరలిపిలో ఉన్న గ్రంథాలు శ్రీమాతాజీవారిచేత ప్రసాదంగా ఇప్పించారు.

శ్రీమనోజ్ కుమార్ తమ ఉపన్యాసాన్ని చోఖామేళుడి అభంగంతో ప్రారంభించారు. గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః అని మాత్రమే కాక గురుస్సాక్షాత్ పరబ్రహ్మ అని, న గురోరధికం, న గురోరధికం, న గురో రధికం అని కూడ గురుగీత చెప్తున్నది. అంతటి అనంతమైన మహత్తర గురు తత్త్వం కూడ చెప్పుకోవలసి వచ్చేసరికి, అది పరమశివుడంతటివాడే సాక్షాత్తూ పార్వతీదేవికి చెప్పినా, అది శబ్దంలో బంధింపబడి గురుగీతగా, ఒక చిన్న పుస్తకంగా అయింది. ఆకాశమంత కాగితం మీద, మేరు పర్వతం అంత సిరాబుడ్డితో, సముద్రమంత సిరా నింపి, కల్పతరువు అనే కలంతో, అనంత కాలం వ్రాసినా, పూర్తిగాక ఇంకా అనంతంగా మిగిలిపోయేది గురుతత్వం అని శ్రీబాబూజీ చెప్పారు.

అయినా ఒక చిన్న ఎఱను ఒక గాలానికి గుచ్చితే ఒక పెద్ద చేప పడినట్లు, ఒక చిన్న శబ్దానికి అంటే నామానికి అనంత తత్త్వ స్వరూపుడైన భగవంతుడు దొరుకుతాడు. నామదేవుడు, చోఖామేళుడు చెప్పింది అదే. కాకపోతే నామాన్ని ఆర్తితో హృదయపూర్వకంగా చేయాలి. చాల మంది నామం చేస్తారుగాని అందులో ఆర్తి ఉండదు. అందుకే ఆ నామ స్మరణ ఫలించదు. పూర్వం గోడ అవతలివారితో మాట్లాడాలంటే కూడా పెద్దగా అరవవలసి వచ్చేది. కాని ఇప్పుడు సెల్‌ఫోన్ ద్వారా ప్రక్కవాడికి కూడా వినిపించనంత చిన్నగా అమెరికాలో వాళ్ళకి స్పష్టంగా వినబడేలాగ మాట్లాడవచ్చు. మనం అంత చిన్నగా మాట్లాడినాకూడా అమెరికాలోవాళ్ళకు వినబడేలాగ సెల్‌ఫోన్ చేస్తుంది. అలాగే మనం ఎంత నిశ్శబ్దంగా నామం చేసినా, ఆ నామం తప్పకుండా వినబడుతుంది. అలా వినపడేలా చేసే రహస్యమే గురుదేవుడు.

స్వామి వివేకానంద చెప్పినట్లు ఒక్కసారి హృదయపూర్వకంగా ఓంకారాన్నిగాని, భగవన్నామాన్నిగాని, గురునామాన్నిగాని హృదయపూర్వకంగా స్మరిస్తే, సింహం గర్జించగానే నక్కలన్నీ అక్కడి నుండి పారిపోయినట్లు మనలో ఉన్న నీచభావాలు, నీచగుణాలు అన్నీ పలాయనం చిత్తగిస్తాయి.

-సశేషం

# మాతాజీ బోధామృతం

- శివ ప్రసాద్

ఆయన అంతా విని భగవంతుడు తప్పకుండా మన ప్రార్థనను ఆలకిస్తాడు. రేపు అందరూ రండి భగవంతుణ్ణి పూజిద్దాం. ఆయన తప్పక వర్షం కురిపిస్తాడు అని చెబుతాడు. మర్నాడు అందరూ ఆ మహాత్ముడి దగ్గరకు వస్తారు. ఆయన ఒక్కొక్కళ్ళనీ చూస్తూ మీరు పూజకు అవసరం లేదు. వెనక్కు వెళ్ళవచ్చు అని చెప్తుంటాడు. అందరూ అయిపోవస్తుంటే వారికి అనుమానం వచ్చి అయితే మాలో ఎవరు పూజకు పనికివస్తారు? అని అడుగుతారు. వాళ్ళల్లో గొడుగు తెచ్చుకున్న ఒకాయన్ని చూపిస్తూ ఆ మహాత్ముడు ఆయన ఒక్కడూ చాలు పూజ చేయటానికి. నేను నిన్న మీతో మనందరమూ కలిసి పూజ చేద్దాము. భగవంతుడు తప్పక వర్షం కురిపిస్తాడు అని చెప్పినా, నా మాటలలో మీకెవ్వరికీ సంపూర్ణమైన విశ్వాసం కలుగలేదు. అడుగో ఆ ఒక్క వ్యక్తి మాత్రమే నిజంగా వర్షం కురుస్తుంది అన్న పరిపూర్ణ విశ్వాసంతో గొడుగు తెచ్చుకున్నాడు. అటువంటి పరిపూర్ణ విశ్వాసం ఉన్నవాళ్ళు మాత్రమే పూజకి పనికివస్తారు. అటువంటివారు ఒక్కరు పూజ చేసినా చాలు, భగవంతుడు తప్పక వర్షం కురిపిస్తాడు అని చెప్తాడు.

భగవద్గీతలో భగవంతుడు కూడా అటువంటి భక్తులు తప్పక తననే పొందుతారు అని చెప్పాడు. మనందరం అటువంటి భక్తిని పెంపొందించుకోవాలి. కాని మనకు కనిపించని, మనతో మాట్లాడని భగవంతుని యందు ఒక్కసారిగా అటువంటి విశ్వాసం కుదరటం చాలా కష్టం. కాని గురుదేవులు అలా కాదు.

కంటను చూడవచ్చు పదకంజములంటి భజించవచ్చు దా
వెంటను నడ్చి వచ్చునహొ! ప్రేమగ పెట్టిన దారగించు నీ
ఇంటికి వచ్చి పూజగొను నేర్పడు శంకల నూడ్చివైచు ము
క్కంటిగ తన్నెరుంగ కడకంటను బ్రోచును శ్రీగురుండు ని
న్నంటియె యున్నవాడు మనసా! గురుపాదములాశ్రయింపుమా!

ఆయనను మనం ఈ నేత్రములతో చూడవచ్చు, సంభాషించవచ్చు, సందేహాలను తీర్చుకొనవచ్చు. మనం పెట్టిన దానిని ఆయన స్వయంగా

ఆరగిస్తారు. మనను సదా అంటిపెట్టుకొని ఉండి మనలను నిరంతరం కంటికి రెప్పలాగా కనురెప్ప పడటంలో నైనా కొంత ఆలస్యం అవుతుందేమో కాని అంతకన్నా తొందరగా కాపాడుతూ ఉంటారు.

మనోజ్ అన్నయ్య చెప్పారు కదా! ఏకనాథ్ గురువులైన జనార్దన పంత్ ఏకనాథ్‌గారికి ఉత్తరం వ్రాస్తూ అందులో నీ కోటలో శత్రువులు ప్రవేశించ కుండా నిరంతరం జాగ్రత్త వహించు అని సూచిస్తారు అని. అంటే ఈ శరీరమనే ఈ కోటలో కామము, క్రోధము మొదలైన అరిషడ్వర్గము, ఈర్ష్య అసూయ ఓర్వలేనితనము వంటి శత్రువులు ప్రవేశించకుండా మనం నిరంతరం జాగరూకులుగా ఉంటూ భగవద్భక్తిని లేదా గురుదేవుల యందు విశ్వాసాన్ని పెంపొందించుకుని గురుకృపకు పాత్రులం కావాలి.

చాలామంది గురుదేవులు చెప్పింది సరిగా వినరు. విన్నది కూడా సరిగా అర్థం చేసుకోరు. బ్రహ్మమే అంతటా ఉన్నది అని గురువుగారు చెప్తుంటే ఒక శిష్యుడు విన్నాడు. అంతా ఆ బ్రహ్మమే అయినప్పుడు తనకు భయమేమున్నది అనుకున్నాడు. అతను వీధిలో వస్తుంటే పిచ్చి ఎక్కిన ఒక మదపుటేనుగు పరుగెత్తుతూ వస్తున్నది. అందరూ భయంతో ప్రక్కలకు పరుగెత్తుతున్నారు. కాని ఈ శిష్యుడు మాత్రం ఏనుగు కూడా బ్రహ్మమే కదా! భయం ఎందుకు? అని తప్పుకోలేదు. పైన మావటివాడు పెద్దగా కేకలు వేస్తున్నాడు,రీ ఏనుగు పిచ్చి ఎక్కి ఉన్నది, దూరంగా తప్పుకోండి అని. కానీ ఈ శిష్యుడు ఆ కేకలను పట్టించుకోలేదు. ఏనుగు రావటం, తొండంతో ఆ శిష్యుణ్ణి విసిరి అవతలకి పారేసి వెళ్ళిపోవటం క్షణంలో జరిగిపోయింది. మిగిలిన శిష్యులు అతన్ని ఎత్తుకుని గురువుగారి దగ్గరకి చేర్చారు. గురువుగారు 'నాయనా! ఏం జరిగింది?' అని అడిగారు.

'అన్నీ బ్రహ్మమే అని మీరే కదా చెప్పారు. ఏనుగు కూడా బ్రహ్మమే కదా అని నేను తప్పుకోలేదు. ఇదిగో ఏం జరిగిందో చూస్తున్నారు కదా!' అన్నాడు. ఆ గురువుగారు 'నాయనా! మరి ఏనుగుపైన ఉన్న మావటివాడు కూడా బ్రహ్మమే కదా. ఆ బ్రహ్మము చేసిన హెచ్చరికను నీవు ఎందుకు పాటించ లేదు?' అని అడిగారు. చాలామంది గురుదేవులు చెప్పినవాటిని అలా విపరీతంగా అర్థం చేసుకుంటారు. పైగా జరగరానిది ఏదైనా జరిగితే నేను గురుదేవుడు చెప్పినట్లే చేశాను ఇలా జరిగింది అని నెపం గురువుగారి మీదకు తోసేస్తారు.

- సశేషం

# మాతాజీ సత్సంగ్ డైరీ

-రమణ ప్రసాద్

(ఫిబ్రవరి17నుండి21 వరకు భీమవరంలోజరిగిన సత్సంగ కార్యక్రమాలలో 18వతేదీన బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ మాతాజీ వారు చేసిన **ప్రబోధమును** సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము - ఎడిటర్)

చక్కటి వాతావరణం. ఇంకా జగత్తు లేవలేదు. ఇప్పుడు ఒక్కొక్క శబ్దం ఆగిపోతుంటే అబ్బ! ఎంత ప్రశాంతంగా ఉంది? ప్రశాంతతే మనకు కావాలి. భగవంతుడు మనకోసం ప్రసాదం చేసిపెడ్తున్నాడు.ఇప్పుడు వినబడుతున్న శబ్దాలు అవే. ధ్యానంలో ఉన్నవాడిని చూసి మనం భగవంతుని ధ్యానించుకుంటున్నాడు అనుకొంటాం. కాని ఏ శబ్దం వినిపించినా మనస్సు ప్రపంచవిషయాలపైకి పరుగెడుతుంది. అందుకని బ్రాహ్మీముహూర్తం లో హాయిగా కూర్చుని ధ్యానముద్రలో తత్త్వ విచారణ చేయాలి. ప్రశాంత వాతావరణంలో పూర్తిగా శ్వాసను లోపలికి తీసికొని ఓంకారం చేస్తూ శ్వాస వదలాలి. చూడండి! శ్వాస తీసికొనేటప్పుడు మాట బయటకు రాదు. శ్వాస కుంభించి వదిలినప్పుడే శబ్దం వచ్చేది. మనం శ్వాస తీసికొంటూనే అన్ని పనులు చేస్తున్నాం. ఏది చేసినా శ్వాస ఉన్నప్పుడే. అది ఉన్నదీ లేనిదీ తెలిసికోవాలంటే పొట్ట అన్నా ఆడుతూఉండాలి, లేక ముక్కు దగ్గర వేలు పెడితే శ్వాస ఆడుతున్నదీ లేనిదీ తెలుసుకోగలం. ఆ గాలే మన నాడిని ఆడిస్తోంది. గాలి పీల్చినప్పుడు నాడి ఆడదు. గాలి విడిచినప్పుడు నాడి ఆడుతుంది. ఈ ప్రక్రియ మనం పుట్టినప్పటినుండి పోయేవరకూ జరుగుతూనే ఉంటుంది.

శ్వాస పోయినా విశ్వాసం మాత్రం సడలకూడదు. గోపికామతల్లులు భగవంతుడు ఉన్నాడు అని ఆ భగవంతుని ఉనికిని గుర్తించారు. సాధన కాలంలో గురుదేవులు ఏదైనా చెప్పమన్నప్పుడు మనం చెప్పలేకపోతేకూడా "నేను చెప్పింది చెయ్యి. అదే వస్తుంది'' అని అది మనంతట మనమే గుర్తు చేసికొని చెప్పేలా చేసేవారు.

శ్వాస లోపలికి పీల్చుకుంటూ దాని గమనం నీలోనే ఉన్నది, నీతోనే ఉన్నది అని గుర్తించాలి. ప్రశాంతత అనుభవించాలి అంటే మన మనస్సు మన నియంత్రణలో ఉండాలి. సంసార విషయాలపై ఉంటే మనస్సు సృష్టిలోని విషయాదులను గ్రహిస్తుంది. దానిని బట్టి మనస్సు మంచి విషయాలను గురించి

ఆలోచిస్తోందా లేక చెడ్డ విషయాలను గురించి ఆలోచిస్తోందా అన్నది అవగాహన అవుతుంది.

దేవుడు నీ ఇంట్లో గూటిలో లేక నీ గుండెలో మాత్రమే లేడు. ఆయన సర్వవ్యాపకుడు. మనస్సు ఏకాగ్రత చెందాలంటే బాహ్యమైనది ఏదీ ఉండకూడదు. మనస్సును 100% ఫ్రీ గా ఉంచాలి. అది ఎప్పుడు అంటే మనస్సు మన మాట విన్నప్పుడు.

'భగవంతుడు నీ వాడు' అనేవారు శ్రీ గురుదేవులు. 'భగవంతుడు ఎప్పుడూ నా వాడే' అని ఎవరు చెప్పగలరు? గోపికలకు కృష్ణుడు మీ అమ్మ కడుపులు బంగారం కానూ హాయిగా ఓం కృష్ణ ఓం కృష్ణ కృష్ణాయ నమః అని నామం చేసికోండి తరిస్తారు. 'వీడెప్పుడూ మీ వాడే' అని అథారిటీగా చెప్పాడు. త్రేతాయుగంలో శ్రీరాముడు ఆచరించి చూపితను ఆచరించినట్లుగా అందరినీ ఆచరించమంటే, ద్వాపరయుగంలో శ్రీ కృష్ణుడు తను చెప్పినది చేయమని చెప్పాడు. అవన్నీ మన గురుదేవులు మనకు అందించారు.

అన్ని రూపాలూమనం ఆశ్రయించిన పాదానివే. మనం ఎక్కడకు వెళ్ళినా, ఏది చూసినా, ఏమి చేసినా మనం ఆశ్రయించిన దేవుడే అని గుర్తించాలి అప్పుడే భగవంతుని సర్వవ్యాపకత్వం అర్థమవుతుంది. మనలోనివాడు సర్వవ్యాపకుడు. ఆయన కదలటానికి స్థానం లేదు. ఆయన కదలకుండా ఉండి మనలను కదిలిస్తున్నాడు. గాలి లేకపోతే శబ్దం రాదు. ఇక్కడ వస్తున్న శబ్దాలే మనలోని అలజడికి కారణం. మనకి ఎలక్ట్రిక్ షాక్ కొడితే ఏం చేస్తాం? వెంటనే మెయిన్ స్విచ్ ఆఫ్ చేస్తాం. మనకి ఈ దృశ్య ప్రపంచంలో వచ్చేవాటిని మనస్సు ఏక్సెప్ట్ చేస్తేనే కదలికలు వస్తాయి. ఏక్సెప్ట్ చేయకపోతే ప్రశాంతత లభిస్తుంది. ప్రపంచంలోని వాసనలకు ఎలా మనం ప్రలోభపడతామో, అలా అణువణువులో ఉన్న భగవంతుని గుర్తించేటట్లుగా మన మనస్సును నియంత్రించాలి. ఆ భావనతో మన రోమ రోమం పులకించిపోవాలి.

మహాత్ములు మనను కరుణించి ఒకరూపాన్ని స్వీకరించి వచ్చారు. అంటే మనకోసం వారు అవతరించి మనను ఉద్ధరించటానికి తమ పాద స్థానాన్ని చూపించారు. మనం ప్రపంచ విషయాలుఎన్ని విన్నా, చూసినా, మాట్లాడినా మనకు తృప్తిని ఇవ్వలేవు.మనం ఏది చెప్పుకున్నాభగవంతుని గురించే చెప్పుకోవాలి. అది నీకు తృప్తిని ఇస్తుంది. 'నువ్వు తిట్టాలన్నా నన్ను తిట్టు. నీ మనస్సును దాయకు' అనేవారు గురుదేవులు.

కరెంట్ ఉన్న తీగకు, కరెంట్ లేని తీగకు చూడటానికి భేదం కనిపించదు. కరెంట్ ఉన్న తీగలో ఉన్న శక్తిని వస్తురూపంలో చూడగలం. (ఫ్యాను, లైట్ రూపంలో) అదే విధంగా పరమాత్మవస్తువు అంతటా నిండి అన్నిటిలో ప్రకాశిస్తుంది. అక్కడ దేహం లేదు. అవతరణ ఉంటుంది. మనం దేహదృష్టితో చూసి వారిని తెలిసికోలేక అవస్థలు పడుతున్నాము. అన్నీ సృష్టి చేసినవాడికి ఒక రూపం ధరించి రావటం ఏమంత కష్టం?మనకోసం వారు ఉన్నట్టు ఉన్నారు. మనం భగవంతునితో ఉన్నాం. మనం భగవంతునిలోనే ఉన్నాం. కాని ఆ భగవంతునికోసమే మన సాధన అంతా. మహాత్ములు వచ్చి కనుమరుగైనా, భక్తుడు ఆశ్రయించిన పాదాన్ని నమ్మి ఏ ఆనందం పొందకుండా ఉన్నాడు? భగవత్స్వరూపమే తానై ఉన్నదని గుర్తించాలి. అది మనస్సుతోనే గుర్తించాలి. మనం ఎందులో ఉన్నాం? బోధలో ఉన్నాం. భగవంతునిలో ఉన్నాం. ప్రతి అణువు, ప్రతి శ్వాస భగవంతునిది అయినప్పుడు మనం భగవంతునిలోనే ఉన్నాం. భగవంతుడు సర్వవ్యాపకుడు. బిడ్డ తల్లి కడుపులో ఉన్నప్పుడు ఇద్దరికీ ఒక్క టిక్కెట్టే. అలాగే ఆ జగన్నాథునిలో ఉన్న మనకీ ఒక టిక్కెట్టే. అంటే ఆ జగన్నాథుడికంటే మనం వేరుగా లేమన్నమాట.

భగవంతుడు సర్వసృష్టిలోని ఆనందాన్ని మనకి ఇస్తున్నాడు. ఆ అనుభూతి మనందరికీ ఉంది. అందుకే ఇక్కడికి చేరాం. దేహం ఉన్నప్పుడే సాధన చెయ్యాలి. గురుబోధను బాగా శ్రవణం చెయ్యాలి. మనస్సును మనం ఆడించే బొమ్మలా చేసికోవాలి. మనం దాని చేతిలో బొమ్మ కాకూడదు. మహాత్ములు ఈ సృష్టిని ఆడిస్తున్నారు. మనస్సుకు నువ్వు వేరుగా ఉన్నావు.మనం ఆడించినట్టు మనస్సు ఆడాలి. భగవంతుని లక్షణాలు మనలో ఉంటే మనని మంచివాడు అంటారు. దైవ లక్షణాలు ఉన్నవాణ్ణి చూసి 'అతడు దేవుడండీ' అంటాం.మనస్సును మచ్చిక చేసికోవటానికి సంకీర్తన, సత్సంగం ఎంతో ఉపయోగపడతాయి.

శ్రీగురుదేవులు మనని తన పాదాల చెంత పెట్టుకొన్నారు. మనకు ఇంక మనస్తాపం ఎందుకు? ధాన్యాన్ని తూర్పారబోస్తే గట్టిగింజ అయితే దగ్గరకొచ్చి పడుతుంది. పొల్లుగింజ అయితే దూరంగా పోతుంది. మనం వారి పాదాల చెంత ఉన్నాము. కాన నిర్భయులము.

శ్రీగురుదేవులు అట్టి శక్తిని, భక్తిని, సాధనాసంపత్తిని , అఖండ జ్ఞాన వైరాగ్యసంపత్తిని ప్రసాదించెదరుగాక! సుఖీభవ! సుఖీభవ!!

## శ్రీ బాబూజీ దివ్యవాణి

ఆంధ్రప్రభ దినపత్రికలో **ఇహం - పరం** శీర్షికలో శ్రీ బాబూజీ వారి అవతార సమయంలో ధారావాహికంగా వెలువడిన శ్రీబాబూజీ మహరాజ్ వారి దివ్య సందేశములను ఇక్కడ యథా - తథంగా ప్రచురిస్తున్నాము. పాఠకులు వీటిని చదివి గురుదేవుల అమృతవాక్కులను జ్ఞప్తికి తెచ్చుకొని ఆనందిస్తారని ఆశిస్తున్నాము -ఎడిటర్

## యోగక్షేమం వహామ్యహం

- జి. వెంకటరత్నం

సామాన్య దృష్టికి మామూలు విషయంగా అనిపించే చిన్న చిన్న సంఘటనల నుంచికూడా మహాత్ములు దివ్య సందేశాన్ని వెలికి తీసి, జ్ఞానామృతాన్ని పంచిపెడతారు. ఇందుకు ఉదాహరణగా ఈ సంఘటనను చెప్పుకొనవచ్చు. నంబూరు కాళీగార్డెన్స్‌లో శ్రీ హనుమత్ కాళీవర ప్రసాదబాబుగారి విజ్ఞాన మందిర్‌లో ఇటీవల జరిగిన సంఘటన ఇది. ఆధ్యాత్మిక దివ్యభావనా విలసితమైన ఆ వాతావరణంలో మూడు రోజులు ఉండి "దీక్ష'' పూర్తి చేసికొన్న దంపతులిద్దరు ఆ రోజున స్వగృహానికి తిరిగివెళ్ళాలని బాబుగారి అభయాశీర్వాదం, అనుమతి కోరటానికి వచ్చారు. వారి అభిప్రాయం తెలుసుకొన్న బాబుగారు " ఈ ఒక్కరోజు ఇక్కడ ఉండి వెళ్ళండి'' - అన్నారు.

"ఇంటి దగ్గర పిల్లలు ఒక్కళ్ళూ ఉన్నారు. ఇక సెలవు ఇప్పిస్తే...'' అని ఆ దంపతులు ఇంకాఏదో చెప్పబోయారు. వారి ముఖంలో ఆందోళన, వారి మాటలలోని ఆతురత గుర్తించి, బాబుగారు గంభీరముద్ర వహించి, ఆర్ద్రస్వరంతో అనునయిస్తూ ఇలా అన్నారు.

"మనమందరం పరమేశ్వరుని పిల్లలం. అందరినీ ఎల్లవేళలా కాపాడుతూనే ఉంటాడు. మంచి చెడ్డల భారం మీరెంతగా వహిస్తున్నారో జగదీశ్వరుడూ అంతగాను బాధ్యత వహిస్తాడు.

గురు సాన్నిధ్యంలో ఉన్నవాడు ఎప్పుడూ భయపడనక్కరలేదు. పరమేశ్వరుడు ఆర్తత్రాణ పరాయణుడు. పరమేశ్వరునికి ప్రతినిధి అయిన పరమ గురువుకూడా అంతటివాడే. నిర్మల చిత్తంతో తనను సేవించిన భక్తుల ఆభీష్టాలను నెరవేరుస్తాడు. ఆర్తిని అంతరింపజేసి ఆదుకొంటాడు.

ఎక్కడో కాశీలో తురుష్కుడై జన్మించిన పరమభక్తశిఖామణి కబీర్‌దాసు, ఇక్కడే,మన భద్రాద్రిలోనే వసించిన మహాభక్తుడు కంచెర్ల గోపన్న(రామదాసు)ను వెతుక్కుంటూ వచ్చి తరింపచేసిన కమనీయ గాథ చూడండి.

ఆ మహాభక్తుని దర్శించిన గోపన్న తన జన్మ చరితార్థమైనదిగా భావించి ఆయననే తన గురుదేవునిగా నమ్ముకుని ఆశ్రయించాడు.

భగవద్భక్తులకు, సాధువులకు నిరంతర సమారాధన జరిగేవేళ, గోపన్న కుమారుడు పొగలు కక్కుతున్న గంజిగుంటలో కాలుజారిపడి చనిపోయాడు. విషయం తెలిసిన గోపన్న, అతని భార్య దుఃఖం దిగమ్రింగి, కంట తడిపెట్టక, విషయం బయటకి పొక్కనీయక సమారాధన ముగించారు.

తర్వాత వారు తమ బిడ్డనెత్తుకొనివెళ్ళి గురుదేవుని పాదాలచెంత ఉంచి దుఃఖించారు. కబీరు వారితో "మీ బిడ్డ చిరంజీవి. మహాభక్తులకు జరిగే సమారాధన వలన పవిత్రమైన ఆ గంజిగుంట వేడి మీ బిడ్డకు ఏమీ అపకారం చేయదు అది ఆ చిరంజీవిసర్వకర్మబీజాలను దగ్ధం చేసి, పవిత్రునిగా మార్చి, ద్విగుణీకృత దేహసౌందర్యం, అంతకు మించిన గుణసౌందర్యం - అన్నిటిని మించిన ఆత్మసౌందర్యంతో ప్రకాశింప జేస్తుంది. మీరు భయపడకండి. కరుణామయుడైన ఆ తారకబ్రహ్మమునే ఆశ్రయించి ఆర్తితో వేడుదాము" అని ఓదార్చాడు.అందరూ రామ ప్రభువును మనసార కీర్తించారు. బిడ్డ నిద్రనుండి లేచినట్లు లేచి కూర్చున్నాడు.

అదీ గురుకటాక్షము! అదే దైవరక్షణ.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం ॥**

అని తానే స్వయంగా చెప్పుకొన్న మాటను ప్రభువు నిలబెట్టుకోడా? ఆర్తత్రాణ పరాయణుడు అనే బిరుదానికి ఆయన ఎన్నడూ కళంకం రానివ్వడు

నిరంతర శ్రీరామ ధ్యాన తత్పరుడైన గోపన్న గోల్కొండ తానీషా క్రింద ఉద్యోగి. భద్రాచలం తహసీల్దారు తన నిజ ప్రభువైన శ్రీరామచంద్రుని జీర్ణ దేవాలయాన్ని పునరుద్ధరించటానికి గోపన్న ప్రభుత్వ ఖజానాలోని 6 లక్షల రూపాయలు ఖర్చు చేసిన ఫలితంగా అతనికి ఖైదుశిక్ష వేశారు.

సూర్యచంద్రాదులు గతులు తప్పినా భగవద్భక్తుడు చలించడని

నిరూపించటానికి, యోగభ్రష్టుడై జన్మించిన తానీషాకు రామదర్శనం కలిగించి, అతనిని రామభక్తునిగా చేయటానికి భగవానుడు చేసిన లీలావినోదం అది.

కట్టించిన దేవాలయాన్ని పాఠశాలగా మార్చి ప్రభుత్వానికి అప్పగిస్తే, రామదాసును విడుదల చేస్తానని, తిరిగి ఉద్యోగమిస్తానని కబీరుతో కబురు పంపాడు తానీషా. ఈ పరీక్షకు తన శిష్యుడెంతవరకు నిలబడతాడోచూడాలనే ఉత్సుకతతో జైలులో ఉన్న రామదాసుకు ఆ విషయం చెప్పాడు కబీరు.

అప్పుడు రామదాసు "గురుదేవా! తుచ్ఛమైన ఈ తనువుకోసం, ఎండమావులవంటి దేహసుఖాలకోసం నా ప్రభువుకు కట్టించిన దేవాలయాన్ని అన్యాక్రాంతం చేయమంటున్నారా? ఇది సత్య గురువులైన మీరునాకిస్తున్న ఆదేశం కాదు. నా చిత్తస్థైర్యానికి తమరు పెడుతున్న పరీక్ష. నా రామ ప్రభువు స్మరణలో యీ జైలుకూడా దివ్యధామంగానే ఉంది. తమకృప వలన ఎట్టి వ్యామోహాలకు నా మనస్సు చలించకుండుగాక!'' అని పలికి రామధ్యానంలో మునిగిపోయాడు. తనబిడ్డ ధీరత్వానికి , అచంచల భక్తికి కబీరు ముగ్ధుడై "రామదాసూ! నిజమైన గురు పుత్రుడవు. విజయం సర్వదా నీదే!'' అని ఆనంద బాష్పాలతో ఆశీర్వదించాడు.

అలాగే, తన భక్తుని రక్షణకై రామప్రభువు లక్ష్మణునితో సహా గోపన్న సేవకుల వేషం ధరించి తానీషాకు దర్శనమిచ్చి, డబ్బు చెల్లించి రామదాసుకు ఋణవిముక్తి, బంధవిముక్తి మాత్రమే కాదు, కర్మబంధములనుండికూడా విముక్తి కలిగించి తరింపజేశారు.''

అందుచేత భక్తిభావనతో శరణాగతి పొందినవారిని, వారి కుటుంబాలను పరమేశ్వరుడు సదా, సర్వదా కాపాడుతూ ఉంటానని,శ్రీ హనుమత్ కాళీవర ప్రసాదబాబు అభయముద్రాంకితులయ్యారు. *

**అన్ని విద్యలకు మకుటాయమైనది బ్రహ్మవిద్య. అన్ని దానాలకు మిన్నయై తృప్తినిచ్చి ఇక చాలు అనిపించేది అన్నదానము. అన్ని విమర్శలలో శ్రేష్ఠమైనది ఆత్మ విమర్శ.**

**- కాళీబాబు**

# సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి)

- స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

కాని వాళ్ళు కొంతదూరం వెళ్ళేసరికి, మళ్ళీ ఆ బాలుడు వాళ్ళమధ్యనే నడుస్తూ కనిపించాడు. నీళ్ళలో మునిగిన జాడలేమీ కనపడలేదు. కట్టుకున్న బట్టలు పొడిగా శుభ్రంగా ఉన్నాయి. ఆశ్చర్యపోతూ, వాళ్ళు "నీవు కాలువలో మునిగిపోయావని అనుకున్నాం బాబూ!'' అన్నారు. "క్షీరసాగర శయనుడు మనవాడై ఉండగా భయమెందుకు?'' అని నవ్వుకుంటూ జవాబు చెప్పాడాబాలుడు. అందరూ సంతోషంగా అతనితో కబుర్లు చెప్పుకుంటూ ముందుకు వెళ్ళారు.

దారిలో ఒక చిన్న బడ్డీకొట్టు వద్ద వాళ్ళు ఏవో కొనుక్కోవటానికి ఆగారు. "బాబూ! నీకు సోడాగానీ మరేదైనా గానీ కావాలా?'' అని అతణ్ణి అడిగారు. అతను వాళ్ళ ప్రశ్నకు జవాబు చెప్పకుండా, ఆ బడ్డీకొట్టు వైపు తేరిపార చూస్తున్నాడు. "ఏమిటి బాబూ? ఎందుకలా కొట్టు వంక చూస్తున్నావు?''అని ఆ బడ్డీకొట్టు యజమాని అడిగాడు. "ఈ కొట్టు ఇంక ఎక్కువ కాలం ఉండదు'' అని ఆ బాలుడు ముక్త సరిగా జవాబు చెప్పాడు. మిగతా వాళ్ళు ఆశ్చర్య పడ్డారు. కాని కొట్టు యజమానికి చాలా కోపం వచ్చింది. ఆ కుర్రవాని చెంపలు వాయిద్దామని చేయి ఎత్తిన ఆ యజమాని, అతని అమాయకమైన ముఖం చూస్తూ అలాగే నిలబడిపోయాడు. ఏదో ఆకర్షణ కనిపించింది. ఎత్తిన చెయ్యి దిగి పోయింది. అందరూ సర్ది చెప్పి ముందుకు సాగారు.



ఇది జరిగిన కొన్ని సంవత్సరాల తరువాత ఆ కొట్టు యజమానికి బాగా వ్యాపారంలో కలిసి వచ్చింది. ఆ బడ్డీ కొట్టును తీసివేసి, ఆ స్థలం కొనుక్కొని అందులో పెద్దమేడ కట్టించి, ఒక గొప్ప హోటల్ ప్రారంభించాడు. అతని వ్యాపారం మూడు పువ్వులూ ఆరు కాయలుగా పెరిగింది. ఒకనాడు తన హోటల్ వైభవం చూసి తానే మురిసిపోతున్న అతని మనస్సులో "ఈ బడ్డీ కొట్టు ఎంతోకాలం ఉండదు'' అని చెప్పిన ఆ బాలుని రూపం మెరుపువలె మెదిలింది. అవును! నిజంగానే ఆ బడ్డీ కొట్టు లేకుండా పోయింది. అంతేకాదు, దాని స్థానంలో ఒక మహా భవనమే తన కనులముందు నిలిచి ఉంది. అది ఆ బాలుని రూపంలో భగవానుడు చేసిన మహదాశీర్వచనమని

గ్రహించిన అతని మనస్సు ఆ బాల భగవానుని ఎడల కృతజ్ఞతతో నిండి పోయింది. ఆనాటినుండి ఆ యజమాని ఆ బాలునికోసం ప్రతిరోజూ వెయ్యి కళ్ళతో నిరీక్షించటం మొదలు పెట్టాడు. ఆ శుభదినం రానే వచ్చింది. ఒకనాటి ఉదయము తన భవనం ముందు ఆ బాలుడు నిలబడి ఉండటం చూసిన ఆ యజమాని, పరుగున వెళ్ళి ఆ బాలునికి పాదాభివందనం చేసి, లోనికి ఆహ్వానించి తీసుకుని వెళ్ళాడు. ఆ బాలుని దేవదేవునిగా భావించిన ఆ యజమాని అతనిని ఎంతో భక్తి శ్రద్ధలతో సేవించుకున్నాడు. ఆ తర్వాత ఆ దివ్యబాలుని దర్శనం ఎన్నోసార్లు ఆ యజమానికి లభించింది. ఒకసారి వారింటికి వచ్చిన ఆ దివ్యమూర్తి, వారి ఇంటి ముందుగదిలో సోఫాలో ఆసీనులై ఉన్నారు. యజమాని పూజ గదిలో పూజ చేసుకుంటున్నాడు. వారి కుమారుడు గదిలోనికి వచ్చి సోఫావైపు చూసి, తిరిగి పరుగున తల్లి దగ్గరకు వెళ్ళి "అమ్మా! మన గదిలో సోఫాలో పెద్ద కోతి కూర్చుని ఉంది.'' అన్నాడు. ఆమె వచ్చి చూసేసరికి జగన్మాత ఆ సోఫాలో దర్శనమిచ్చింది. ఆమె ఆశ్చర్యపడుతూ భర్తకు చెప్పింది. ఆయన వచ్చేసరికి ఏమీ ఎరుగని అమాయకుని వలె చిరునవ్వులు ఒలికిస్తూ ఆ దివ్యబాలుడు కూర్చుని ఉన్నాడు.

ఆశ్చర్యానందాలలో మునిగి తేలిన ఆ దంపతులు, సోఫాలో కూర్చున్న దివ్య మూర్తిని **"శ్రీహనుమత్ కాళీ వర ప్రసాద బాబు''** అని ఆరాధనా భావంతో పిలుచుకున్నారు. ఆ దివ్యమూర్తియే సమర్థ సద్గురు శ్రీహనుమత్ కాళీవర ప్రసాద బాబూజీ మహరాజ్. ఈ కథనం యథార్థంగా జరిగిన విషయమని తెలిసిన భక్తులు ఇప్పటికీ ఉన్నారు.

2. శ్రీబాబు పరమ భక్తులైన మరొకరు తమ స్వప్న దర్శనాన్ని ఇలా వివరించారు-

"నిర్మలంగా ఉన్న ఒక సరోవరంలో చక్కగా వికసించిన పద్మము ఉన్నది. ఆ పద్మంలో, గులాబీ రంగులో ఉన్న రెండు అందమైన బుల్లి పాదాలు కనిపించాయి. నేను ఆ పాదాలను తాకవలెనని సమీపించేటంతలో, ఒక చిన్నారి బాలుడు, 4-5 సంవత్సరములవాడు, గులాబి రంగులో మెరిసిపోతూ,బొద్దుగా, ముద్దు లొలికే నగుమోమువాడు ఆ పద్మంలో కనిపించాడు. అతడు నెమ్మదిగా తన బుల్లి పాదాలను పద్మంనుండి బయటకుపెట్టి , చిట్టి చిట్టి అడుగులు నీటిపై వేసుకుంటూ నడచి, గట్టుపైకి వచ్చాడు. నేను "బాబూ! నీవెవరవు?'' అని అడిగాను." **నేను నేనే, మీ బాబును. మీ అందరి మధ్యకు రావటానికి ఇలా ఆవిర్భవించాను"** అంటూ ఆ బాలుడు అదృశ్యమై, శ్రీబాబు దర్శనమిచ్చి ఇలా చెప్పారు.

-సశేషం




(గతసంచిక తరువాయి)

-రమణ ప్రసాద్

ఒక్కసారి ఈ సుదర్శన చక్రం తన చేతిలోకి వస్తే... ఇంక కృష్ణుని ఇహలోక యాత్ర పూర్తి అయి అతడు పరలోక గమనం చేస్తాడు.ఎంత సునాయాసం ఈ పని! ఇహలోకానికి కృష్ణుని వీడ్కోలు... అదీ తన చేతులమీదుగా!... ఏ చక్రాన్ని రాజసూయ యజ్ఞంలో వందలాదిమంది భయభీతులై చూశారో ఆచక్రం తన చేతివేలిపై తిరుగుతూ ఉంటే, తనని స్తుతించకుండా ఎవరు ఉండగలరు?

"మధుసూదనా!" ఒకరోజు ఆతిథ్యమిచ్చిన కృష్ణునితో అతిథి అయిన అశ్వత్థామ ప్రాసాదంలో కూర్చుని సావకాశంగా చర్చిస్తూ ఇలా అన్నాడు, "నా తండ్రి ద్రోణుడు నాకు నేర్పిన అస్త్ర శస్త్రవిద్యలు ఈ సమగ్ర ఆర్యావర్తంలో ఇంకెవరూ నేర్చుకొని ఉండరు."

"నువ్వు చెప్పింది నిజం అశ్వత్థామా!" కృష్ణుడు తన సరళ స్వభావంతో ఇంకా ఇలా అన్నాడు, "ఆచార్య ద్రోణుడు స్వయంగా జమదగ్ని కుమారుడైన భగవాన్ భార్గవుని శిష్యుడు. ఇప్పుడు భార్గవుడు నివృత్తులైనారు.ఇక ఆచార్యులను మించిన వారు ఎవ్వరూ లేరు. ఉండబోరు!"

"అస్త్ర శస్త్ర విద్యలలోని రహస్యాలను నీ ముందు ఉంచదల్చుకొన్నాను కేశవా!" అశ్వత్థామ తన కూటనీతిలో భాగంగా ఈ పాచిక వేశాడు. "ద్వారక అజేయమైనది. దీనికి యదునందనుడవైన నీవు అధిపతివి," అంటూ అశ్వత్థామ కొంచెం ఆగాడు....కృష్ణుని ముఖంలో వెలిగిన దరహాసం మరింతగా వెలుగులు చిమ్మింది.

"మధుసూదనా!, మీరు ఈ శస్త్రవిద్య లోని రహస్యం విపులంగా తెలిసికొనిఉంటే, స్వయంగా ఇంద్రుడుకూడా యాదవులవైపు కన్నెత్తి చూడలేడు..." అశ్వత్థామ చెప్పుకుపోయాడు... కృష్ణుని వదనంపై విరిసిన దరహాసంలోని అంతరార్థాన్ని గ్రహించగలిగే దృష్టి అప్పుడు అతనికి ఉంటేగా!

"నావద్ద ఉన్న ఈ గూఢవిద్య సారాన్నంతా మీ పాదాలవద్ద ఉంచటానికి సిద్ధంగా ఉన్నాను కృష్ణా..."అశ్వత్థామ తాను వాసుదేవుడు కావాలనే కల సాకారమవుతున్నట్లుగా మురిసిపోయాడు. "దీనికి ప్రతిఫలంగా నాదొక చిన్న కోరిక. దానిని నువ్వు తీర్చు మధుసూదనా!"

"అశ్వత్థామా!" కృష్ణుడు తన సహజ స్వరంతోఅశ్వత్థామ బుజంమీద చేయి వేసి అన్నాడు, "నువ్వు నా అతిథివి! నువ్వు కోరేది ఏదైనా తీర్చటం నా అతిథి ధర్మం కాదా! నువ్వు బ్రాహ్మణుడవు. అంతకు మించి ఆచార్యపుత్రుడవు - నువ్వు ఏది అడిగినా అది నాకు స్వీకారమే! శిరోధార్యమే. నిస్సంకోచంగా అడుగు! నేను ఏ ప్రతిఫలం కోరకుండానే నీ కోరికను తీరుస్తానని మాట ఇస్తున్నాను!"

అశ్వత్థామ అనందానికి అవధులు లేకుండాపోయాయి. ఇక నా కల సాకారరూపం దాల్చబోతోంది... ఏ విఘ్నం లేకుండా... కృష్ణుడు తనకు ఇచ్చిన మాట ప్రకారం ఇంక ఒకటి రెండు క్షణాలలో సూర్యుని ప్రచండ తేజంతో మెరిసే ఆ సుదర్శన చక్రం తన చేతిలో ఉంటుంది... సుదర్శన చక్రం తన చేతికి రాగానే దానికి మొదటిగా ఎర అయ్యే బలిపశువు కృష్ణుడే...

...ఆర్యావర్తంలో ఏకమాత్రుడైన వాసుదేవుడు ఇక తానే అవుతాడు!

"అయితే మాధవా!... " అశ్వత్థామ ధైర్యంగా అడిగాడు..." నా అస్త్ర -శస్త్ర విద్యా రహస్యాలకు బదులుగా నీ వద్ద ఉన్న సుదర్శన చక్రాన్ని కోరుకొంటున్నాను!"

కృష్ణుని భువనమోహనమైన మందహాసంలో కొంచెంకూడా మార్పు లేదు. ఆయన మాట సంయమంతో కూడి ఉన్నది... అశ్వత్థామ వీపుపై చేయివేసి నిమురుతూ అన్నాడు, " ఆచార్యపుత్రా! నువ్వు కోరేది సుదర్శన చక్రమేగా? అది ఏమంత పెద్ద విషయం?... దీనికోసం నీ అమోఘమైన అస్త్ర - శస్త్ర విద్యలను సమర్పించవలసిన అవసరం లేదు. ఇప్పుడు నాకు నీ అస్త్ర -శస్త్ర విద్యల అవసరమూ లేదు. నాకు అవసరమైనప్పుడు, నేను దానికి తగిన ఏర్పాటు చేసికొంటాను కదా! వెళ్ళు... ఈ క్షణంనుంచి సుదర్శన చక్రం నీదైంది... సంతోషంగా దానిని నువ్వు తీసుకువెళ్ళు," అని కొంచెం ఆగి మళ్ళీ అన్నాడు, "నువ్వు తీసుకు వెళ్ళగలిగితే!"

"సుదర్శన చక్రం ఈక్షణంనుండి నీదే!" - అన్న మాట చెవిన పడగానే అతనికి ఇంక ఏమీ వినపడలేదు... అతడు ఉల్లాసంలో తేలిపోయాడు... కృష్ణుడు

చివరగా చెప్పినది అశ్వత్థామ చెవికెక్కలేదు...సుదర్శన చక్రంవైపు మెరుపువేగంతోలంఘించాడు... కృష్ణుడు అడ్డుపెట్టిన చేతినికూడా పక్కకు తోసేస్తూ చక్రం వద్దకు చేరాడు. భవ్యాసనం మీద ఉన్న ఆ సుదర్శన చక్రంపైన ఆత్రంగా చెయ్యి వేశాడు. అతని రోమరోమాలూ నిక్కబొడుచు కున్నాయి - ఇక నేనే దీనిస్వామిని!...

"నేను...అశ్వత్థామను.. ఈ సుదర్శన చక్రానికి స్వామిని నేనే'...

ఎంత ఆతురతతో ఆ చక్రంవైపు ఉరికాడో, అంతకంటే ఎక్కువ ఆశ్చర్యంలో పడటం అతని వంతైంది.... అతడు సుదర్శన చక్రందాకా వెళ్ళాడు, కాని అక్కడకు వెళ్ళగానే అతనిలోని శక్తి అంతా క్షీణించిపోయింది... సుదర్శన చక్రంపైన పడిన అతని వేళ్ళు శక్తిహీనమై వ్రేలాడాయి. శరీరంలో మంటలు పుట్టుకొచ్చాయి. అతను సుదర్శన చక్రాన్ని పట్టుకోవటానికి ఎంతో ప్రయత్నం చేశాడు. కాని అది ఆవగింజంతైనా కదలలేదు. తాను చేసిన ఈ జుగుప్సాకరమైన చేష్టను కృష్ణుడు చూడలేదు కదా అని సిగ్గుతో కుంచించుకు పోయాడు. వెనుకకు తిరిగి చూడకుండానే రెండవ ప్రయత్నంగా సుదర్శన చక్రం మధ్యభాగంపైన చేయి వేశాడు... బలమంతా ఉపయోగించి చక్రాన్ని ఎత్తటానికి ప్రయత్నం చేశాడు... లాభం లేకపోయింది. అతనిలో వణుకు పుట్టింది. కృష్ణుడు తన వైఫల్యాన్ని చూసి ఎగతాళిగా నవ్వుకోవటం లేదు కదా?... లేక ఒకవేళ కృష్ణుడికి తాను చేయ దల్చుకున్న ఘోరకృత్యం గురించి ముందే తెలిసిపోయిందా!

అతడు తిరిగి తన బలమంతా ఉపయోగించి రెండు చేతులతో సుదర్శన చక్రాన్ని ఎత్తే ప్రయత్నం చేశాడు... కాని అది కొంచెమైనా కదలలేదు. అశ్వత్థామకు ముచ్చెమటలు పట్టాయి! ఏ సుదర్శన చక్రం కృష్ణుని కుడిచేతి చిటికెన వేలుపై ఒక పువ్వువలె అలలారుతూ ఉండేదో, ఆ సుదర్శన చక్రం అశ్వత్థామ వంటి వీరయోధుడు తన శక్తినంతా కూడదీసుకొని రెండు చేతులతో ఎత్తటానికి ప్రయత్నం చేసినా ఏ మాత్రం కదలలేదు. అయినా అతడు చివరి ప్రయత్నం చేశాడు. కాని ఏమీ లాభం లేక పోయింది.

హతాశుడై వెనుకకు తిరిగి కృష్ణునివైపు చూశాడు. కృష్ణుని ముఖంపై కరుణార్ద్రమైన చిరునగవు... అతని కనులలో అదే స్నిగ్ధత... ఆ కనులవైపు తను సూటిగా చూడలేకపోతున్నాడు... అశ్వత్థామ సిగ్గుతో తల వాల్చేశాడు!

-సశేషం

## శ్రీశ్రీశ్రీ హనుమత్‌కాళీ వర ప్రసాద బాబు ఆవాస గురుకులం

(శ్రీకాళీగార్డెన్స్, నంబూరు ఆర్.ఎస్. గుంటూరు జిల్లా, ఆం.ప్ర)

**(ప్రభుత్వ గుర్తింపు పొందిన విద్యా సంస్థ)**

**ఆగండి!** **ఆలోచించండి!!**

విద్య అంటే విజ్ఞానము. అది అమ్మబడేది కాదు. కొనబడేది కాదు. అది అనుభవంతో కూడిన అధ్యాపకులు రూపొందించిన కార్యక్రమాల ద్వారా ఆర్జించేది. ఎల్.కెజి నుండి టెన్త్ క్లాస్ వరకు ఇంగ్లీషు మీడియంలో శిక్షణ.

ప్రత్యేకతలు :

- ప్రశాంత వాతావరణము ఆధ్యాత్మిక శిక్షణ
- యోగాసనాలు
- క్రమశిక్షణ, సత్ ప్రవర్తన
- అగ్రగామి టీచర్లచే బోధన
- రెసిడెన్షియల్ ట్యూటర్ల పర్యవేక్షణలో చదివించటం
- బాలబాలికలకు ప్రత్యేక హాస్టలు వసతి
- వీక్లీ టెస్ట్‌లు, డైలీ అస్సైన్‌మెంట్లు
- కంప్యూటర్ ఎడ్యుకేషన్
- డే స్కాలర్స్‌కి బస్సు సౌకర్యము
- సంస్కృత, హిందీ పరీక్షలకు శిక్షణ
- వైద్యసదుపాయం
- సెమి రెసిడెన్షియల్ సౌకర్యము కల్పించబడుతుంది.

గమనిక :

1. ఈ పాఠశాల యందు కనీసము 3సంవత్సరములు చదివి, గణనీయమైన మార్కులను సాధించిన పేదవిద్యార్థులకు స్కాలర్‌షిప్ సౌకర్యము కలదు.

2. స్కూలు 3-6-2009న తెరువబడును. వివరములకు కరెస్పాండెంట్‌గారిని స్వయంగాగాని, ఫోన్‌ద్వారాగాని సంప్రదించవచ్చు. లేదా వారికి వివరముల కొరకు వ్రాయండి.

**డి.జె. బాలకృష్ణలాల్**
కరెస్పాండెంట్
ఫోన్ నెం. 2594211 (ఆ), 2293229 (ఇ)

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,